## గ్రంథకర్త పరిచయం

గ్రంథకర్త : **పి.యల్.నారాయణరావు**
స్వస్థలం : రైల్వే న్యూకోలనీ, విశాఖపట్టణం.
పుట్టినతేది : 8-11-1940
సతీమణి : సౌ॥ శ్రీమతి గిరిజ
తల్లిదండ్రులు: కీ॥శే॥ సుభద్రమ్మ
కీ॥శే॥ సహజకవి పంతుల చినజోగారావు

**మొదటి సుందరకాండ గానం**

29-2-1992 శ్రీ సద్గురుబ్రహ్మ రామదూత మందిర ప్రాంగణం మధురానగర్, విశాఖపట్నం.

**సన్మానాలు, పురస్కారములు.**

1974 ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ శ్రీ ఎమ్.ఆర్. అప్పారావు గారిచే
1980-1984 పద్మశ్రీ ఘంటసాల కల్చరల్ అసోసియేషన్, యలమంచిలి
1981 విశాఖ Insustrial and Commercial Exhibition.
1981 Lion Ladies Auxiliary-Visakha North.
1984 సంగీత సంగమం. జమ్‌షెపూర్
1985 మద్రాస్ తెలుగు అకాడమీ
1992 రాగతరంగిణి, బరంపురం,
1995 సర్వెంట్సు ఆఫ్ గాడ్స్ సొసైటీ "**అభినవ ఘంటసాల**"
1996 స్వరరంజని & సమన్వయ సమితి, విశాఖపట్నం వారిచే "**పావని సుందరగానలోల**" బిరుదు ప్రదానం.
1997 శ్రీకోరిమిల్లి వీరభద్రరావు మెమోరియల్ & కల్చరల్ & ఎడ్యుకేషనల్ ట్రస్టు, యలమంచిలి వారిచే "**గురజాడ అవార్డు**"
1998 సన్మానం కళావేదిక, విశాఖ.
1999 విశాఖరత్నవారిచే "**కళారత్న**" బిరుదు ప్రదానం

**ఇతర అముద్రిత రచనలు :**

శ్రీ రామాయణ గాన సుధలో యుద్ధకాండము
శ్రీ పావన పావనిచరితగానామృతం
లలిత, భక్తి గీతాలమాల

శ్రీ

# రామాయణ గానసుధ

## ( బాలకాండము )

గ్రంథకర్త :

"కళారత్న"

పంతుల లక్ష్మీనారాయణరావు

విశాఖపట్నం - 530 016

# *Sree Ramayana Ganasudha*

( BALAKANDAMU )

By "KALARATNA"
"PAVANI SUNDARA GANALOLA"
PANTULA LAKSHMI NARAYANA RA
M.A. B

Published on : 21 - 3 - 2002 - (SRI RAMA NAV

**Price : Rs. 60-00**

No. of copies : 1000



Books Available at :
" Kalaratna "P. L. NARAYANA RAO
M. A, BGL.
" Sri Rama Maruti "
D. No. 43-7-32, Rly. New Colony,
Visakhapatnam - 530 016
Phone : 561603

కృతికర్త దంపతులు



శ్రీ పి.ఎల్. నారాయణరావు, శ్రీమతి గిరిజాకుమారి



గ్రంధకర్త, ఆగష్టు 15, 1956 పోర్టుజింఖానా క్లబ్బులో మొదటి లలితసంగీతకచేరి (16 సం॥ వయస్సులో)



92 సుందరకాండ ఆవిష్కరణ సభ, శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామివారి ఆశీస్సులందుకుంటున్న గ్రంథకర్త.



గ్రంథకర్తకు " **పావని సుందరగానలోల**" బిరుదు ప్రదానం గావిస్తున్న ప్రముఖులు శ్రీ డి.వి. సుబ్బారావు నగర మేయరు,
డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి, Vice Chancelor A.U.
కళాప్రపూర్ణ జి. అచ్యుత రామరాజు



ది 28-12-98 విశాఖరత్న వారిచే ' కళారత్న' అవార్డు అందుకుంటున్న
గ్రంథకర్త శ్రీ పి. ఎల్. నారాయణరావు



" కళాభినేత్రి" జమునా రమణారావు గారితో గళం కలిపి
పాడుతున్న గ్రంథకర్త



ఆంధ్ర విశ్వవిద్యాలయం డైమండ్ జూబ్లీ సందర్భంగా
శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు గారిచే సన్మానింపబడిన గ్రంథకర్త
ఎల్. నారాయణరావు, " కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రి గారితో



పుష్పగిరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యుల వారి వద్ద
మొట్ట మొదట " శ్రీ ఆంజనేయ స్వామి చరిత్ర" పాడిన
కళారత్న పి. ఎల్. నారాయణరావు, శ్రీ పి. ఎస్. ఎన్. మూర్తి. (తబల)

ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి    "శారదాపీఠం"
ఎం.ఏ. పిహెచ్.డి. (తెలుగు),    46-15-35, మండావారి వీధి
ఎం.ఏ. పిహెచ్.డి. (సంస్కృతం)    విశాఖపట్నం-530 016.
తెలుగు శాఖ    ఫోన్ : 541003
ఆంధ్ర విశ్వకళా పరిషత్, విశాఖపట్నం-3.

శ్రీ శివాయ గురవే నమః

# పరితోషం

వేదవేద్యుడైన పరమ పురుషుడు దశరథనందనుడుగా అవతరించగా వేదమే శ్రీమద్రామాయణంగా వాల్మీకి మహర్షిచే రచింపబడింది. ఆ మహాకావ్యం ఏడు కాండలలో సంతరింపబడింది. విషయ ప్రాధాన్యాన్ని బట్టి ఒక్కొక్క కాండకు ఒక్కొక్క పేరు పెట్టబడింది.

తపస్స్వాధ్యాయనిరతుడు వాగ్మివరుడు మునిపుంగవుడు అయిన నారదునిచే వాల్మీకి మహర్షి రాముని దివ్య చరిత్రమును సంగ్రహముగా మొట్టమొదట ఉపదేశింపబడినాడు. అనంతర బ్రహ్మ వాల్మీకి ఆశ్రమానికి వెళ్ళి రమ్యమైన రామకథను రచించమని ఆదేశింపగా వాల్మీకి రామాయణ రచనకుపక్రమించినాడు.

శ్రీమద్రామాయణం బాలకాండతో ఆరంభింపబడింది. దశరథుని పుత్రకామేష్టి, శ్రీరామాదుల జననం విశ్వామిత్రుని యాగరక్షణకై రామలక్ష్మణులు అతనివెంట వెళ్ళడం అహల్యాశాపమోచనం తాటకవధ మారీచ సుబాహులపై రాముడు వాయవ్యాగ్నేయాస్త్రములు ప్రయోగించి విశ్వామిత్రుని యాగాన్ని సంరక్షించడం శివధనుర్భంగం చేసి రాముడు సీతను పరిణయం చేసుకోవడం లక్ష్మణాదుల వివాహం పరశురాముని గర్వభంగం అనే బాలకాండలోని ప్రధానాంశాలు.

దుష్టశిక్షణ శిష్ట సంరక్షణ అనే రెండూ భగవదవతార పరమ ప్రయోజనాలు. రామాయణంలో ఇంచుమించు ప్రతి కాండలోను రాముని అవతారతత్త్వం చక్కగా ఆవిష్కరింపబడింది. బా

ండలో తాటకవధ రాముని దుష్టశిక్షణకు అహల్యాశాప విముక్తి
తని మహిమకు ప్రబల నిదర్శనములు.

శ్రీమద్రామాయణం చదువుకోడానికి పాడుకోడానికీ కూడా
నుగుణంగా రచింపబడింది. "పాఠ్యే గేయే చ మధురమ్" అని
గ్రంథంలోనే వేర్కొబడింది.

రామకథని మహాకవులెందరో ఎన్నెన్నో విధాలుగా రచించి
ఎతాన్ని తరింపజేసుకొంటున్నారు. శ్రీ పంతుల లక్ష్మీనారాయణ
ావుగారు గానానుగుణంగా గేయరూపంలో రచించడం విశేషం.

చిన్న చిన్న పదాలతో మధురమైన భావాలని సర్వజన
గమంగా ఏర్చికూర్చి "శ్రీరామాయణ గానసుధ" అనే పేరుతో
ామాయణాన్ని రచించడం పరమశ్లాఘ్యరమణీయం. పదమార్దవం,
ావలాలిత్యం, విషయవైశద్యం అనేవి ఈ గేయానువాదంలోని
శిష్ట లక్షణాలు.

రాముని శివధనుర్భంగ సన్నివేశాన్ని శ్రీ పంతులవారు
గా అభివర్ణించినారు.

ఆ నిర్ఘోషకు భూనభంబులు
దద్దరిల్లెను పటుతరంబున
దిగ్గజంబులు వణకసాగెను
నీరధులంత ఘోషలాపెను
ఘనకార్ముక విచ్ఛేదసమునకు
రామలక్ష్మణ గాధేయాదులు
జనక మహీపతి తప్ప అందరును
మూర్ఛ నొందిరి మహాధ్వనిని విని

ఈ విధంగా బాలకాండను పరమ రమణీయంగా రచించిన
యకోత్తములు గానకళా పరిపూర్ణులు అయిన శ్రీ పంతుల
క్ష్మీనారాయణరావు గారికి శ్రీ రామచంద్ర పరమాత్మ అనుగ్రహం
ష్కలంగా కల్గుగాక అని హార్దికంగా ఆకాంక్షిస్తున్నాను.

శుభం భూయాత్

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

# నా గురించి

కీ. శే. "సహజకవి" పంతుల చినజోగారావు, కీ॥ శే॥ సుభద్రమ్మల పదకొండుమంది సంతానంలో నేను మూడవవాడిని. నా తండ్రిగారు "శ్రీమద్రామాయణ పారిజాతం" అను నిర్వచనోత్తర రామాయణమును రచించి దానిని శ్రీ భద్రాద్రి రామచంద్రులవారికి అంకితము గావించి, వారి జన్మ చరితార్థము జేసికొనినారు.

విరుతప్రాయంలో మా తండ్రిగారు నాచేత క్షుణ్ణంగా "పెద్ద బాలశిక్ష", అనేక కవులు వ్రాసిన శతకాలు చదివించారు. కొంత జ్ఞానం వచ్చాక మా తండ్రిగారి పుస్తక భాండాగారంలో నున్న అనేక గ్రంథాలు చదివే అవకాశం కలిగింది. క్రమేపి తెలుగు నుడికారం మీద మక్కువ ఎక్కువయింది. ఈ మక్కువే నన్ను విద్వాన్ శ్రీ దివాకర్ల రామమూర్తిగారికి, ఉభయ భాషా ప్రవీణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి, శ్రీ చర్ల గణపతిశాస్త్రి గారికి, "కళాప్రపూర్ణ" గణపతిరాజు అచ్యుతరామ రాజుగారికి దగ్గర చేసింది. వారి అవ్యాజమైన ప్రేమాశీస్సులు పొందగలిగే అవకాశం కలుగజేసింది.

నా 7 సం॥ ల వయస్సులో గాన గంధర్వ, పద్మశ్రీ ఘంటసాలగారు "లైలామజ్నూ" చిత్రంలో పాడిన "పయనమయే ప్రియతమ నను మరచిపోకుమా" అనే పాట నా హృదయం మీద చెరగని ముద్రవేసి అతనికి ఏకలవ్య శిష్యునిగా జేసింది. నాకు గానం మీదగల మక్కువ జూసిన నా తల్లిగారు నన్ను అమితంగా

ప్రోత్సహించేవారు. ఈనాడు 44 సం॥రాలుగా లలితసంగీత గాయకునిగా వెలుగొందడానికి ప్రోత్సహించిన నా తల్లిగారికి, తెలుగులోని కమ్మదనాన్ని ఆస్వాదింపజేసిన నా తండ్రిగారికి, నన్ను కవిగా తీర్చిదిద్దిన నా గురువులందరికీ నేను ఎంతో ఋణపడి ఉన్నాను.

నేను మొట్టమొదటిసారిగా ఆగష్టు 15, 1956న పోర్టు జింఖానా దగ్గర కచేరీ చేశాను. ఆ తరువాత 1958 అక్టోబరు నెలలో అంతర్ కళాశాల పాటల పోటీలో ఉత్తమ గాయకునిగా ఎన్నిక కాబడి అంతర్ విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో పాల్గొనుటకు ఢిల్లీ వెళ్ళి నాటి భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ జగజ్జీవన్‌రామ్, బూర్గుల రామకృష్ణారావు మున్నగు ప్రముఖుల ముందు గానంచేసి వారి ఆశీస్సులు అందుకున్నాను. తిరిగి 1968వ సంవత్సరంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి ఉత్తమ గాయకునిగా ఎన్నిక కాబడి, ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల యువజనోత్సవాలలో పాల్గొని నాటి రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి వారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరి వారి కుమారులు శ్రీ శంకర్ గిరి మరికొంతమంది ప్రముఖుల ముందు రాష్ట్రపతి భవన్‌లో పాడి వారి అవ్యాజమైన ప్రేమకు నోచుకున్నాను. నాటినుండి నేటి వరకు ఈ 44 సంవత్సరంలలో పలు ఆర్కెస్ట్రాల సహకారంతో ఆంధ్రలోను, ప్రవాసాంధ్ర ముఖ్యపట్టణములలో 3500 పైచిలుక లలితసంగీత కచేరీలు చేసే అదృష్టానికి నోచుకున్నాను.

1982లో ఉద్యోగరీత్యా నాకు కొన్ని చికాకులు ఎదురై జీవితం మీద విరక్తి కలిగినప్పుడు, ఒక మిత్రుని సలహాపై శ్రీ ఆంజనేయస్వామివారి పాదాలను ఆశ్రయించాను, నాటినుండి

ఆయనే నా ఆరాధ్యదైవం, ఆయనే తల్లి, తండ్రి, గురువు. స్వామి వారి ఆదేశమో, మహిమో, ఒకరోజు శ్రీ సీతారాముల కళ్యాణ ఘట్టాన్ని గానరూపంలో వ్రాయగా, అది చదివిన వారు నన్ను ప్రోత్సహించి మొత్తం రామాయణాన్ని గానరూపంలో వ్రాయమని సలహానిచ్చారు. అది మొదలు ముఖ్యంగా నా తండ్రిగారు రచించిన "శ్రీ రామాయణ పారిజాతం"ను ఆమూలాగ్రం పఠించి ముందుగా శ్రీ అంజనేయస్వామి వారి కృపాకటాక్షవీక్షణాలకు పాత్రుడనవాలని తలచి సుందరకాండము "శ్రీ పావని సుందర గానసుధ" అన్న పేరుతో వ్రాసి, ముద్రించి, పాఠక లోకానికి అందించగలిగాను. నేను వ్రాసిన సుందరకాండను, నేనే గానంచేసే మహద్భాగ్యాన్ని కలుగజేసారు నా సుందరరూపుడు అంజని సుతుడు.

ఏనాడు సుందరకాండను పూర్తి చేసి, గానం చేశానో నాటి నుంచి నా కష్టనష్టాలన్నీ మటుమాయం అయ్యాయి. జీవితంలో నేను చేపట్టలేనన్న కార్యక్రమాలన్నీ సునాయాసంగా జరగటం మొదలయ్యాయి. "అసాధ్యసాధక స్వామిన్, అసాధ్యం తవ కింవద, రామదూత కృపాసింధో మత్కార్యం సాధయః ప్రభో" అని పఠించి స్వామివారిని మనసా, వాచా కర్మణా నమ్మినవారికి అన్నీ జయాలే, అపజయాలు చవిచూడరని నా నమ్మకం. వ్యాకరణం గాని ఛందస్సుగాని క్షుణ్ణంగా రాని నేను, రామగానాన్ని వ్రాయటానికి నిస్సందేహంగా అనర్హుడను. కాని స్వామివారి ఆశీస్సుల తోనే శ్రీరామగానాన్ని వ్రాయగలిగే శక్తిని సంపాదించుకున్నాను, దానికితోడు నిరంతరం నాకన్నా ఎక్కువగా భక్తి ప్రపత్తులతో శ్రీ మారుతిని కొలిచే నా సహధర్మచారిణి చి॥ సౌ॥ గిరిజ నాకు మనోబలాన్ని సమకూర్చి, మిగిలిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధకాండలు వ్రాయగలిగేటందుకు శతవిధాల దోహదపడింది. అదే విధంగా నా కుమార్తె చి. సౌ. పద్మశ్రీ కుమార్ నేను వ్రాసిన శ్రీ రామాయణ గానసుధను ఎప్పటికప్పుడు

అందంగా కాపీవేసి కడు శ్రద్ధతో సాకందించి ఆ పావని ఆశీస్సు లందుకొంది. ఆమె నమ్ముకున్న ఆశయాలకు ఆ పావన పావని అన్ని విధాల సహకరించాడు. ఈశ్వరాంశ సంభూతుడైన శ్రీ ఆంజనేయస్వామివారు, తనను నమ్మినవారికి, కొలిచేవారికి, సుందర కాండ పారాయణ జేసేవారికి, విద్యా, వినయాదులతో బాటు సకలైశ్వర్యాలు కలుగజేస్తాడన్నది నిత్య సత్యం.

ఈ బాలకాండను తక్కువ వ్యవధిలో ముద్రించిన పేపూ ప్రింటింగ్ ప్రెస్సువారికి, ముందు మాటలు వ్రాసి నన్నాశీర్వదించిన ప్రసిద్ధ పండితులు డాక్టరు వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి M A. Ph. D (Sanskrit) Ph. D. (Telugu) గారికి నా కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణకు ధనరీతిని సాయపడిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారికి నా ధన్యవాదాలు.

15-2-2002 " కళారత్న "

విశాఖపట్నం పంతుల లక్ష్మీనారాయణరావు

# శ్రీ వినాయక స్తుతి

శ్రీ వినాయకా — పార్వతి తనయ
ప్రమథ గణాలకు — అధిపతి వీవు
సకల లోక — నివాసులందరు
నిన్ను ముందుగా — పూజించనిచో
వారి పనులకు — విఘ్నము కలుగును
కావున నిన్ను — నే మది నిలిపితి
శ్రీ రామాయణ — గానము రాయగ
నా కలమందున — నీవు నిలువుమా

# సర్వ దేవతా స్తుతి

పాలసంద్రమున — ప్రజ్వలించిన
ఫల్గుణు బోధించిన — పార్థసారథికి
మురారి పదములు — మెత్తగ ఒత్తెడి
ముగ్ధమోహన — స్వరూపిణి లక్ష్మికి
సత్యలోకమున — వేద పురుషులకు
శారదామాత — పాదయుగమునకు
భూలోకమున — బుధులందరికి
ప్రణామాంజలు — లర్పించుచుంటిని

# కవి గాయకులకు - నీరాజనము

శ్రీ రామాయణ - గానము వినుచు
ముక్తికి దారిదు - సోపానమది
వల్మీక భవుని - కలమున విరసిన
వెన్నెల వెలుగు - విభుని చరితము
కాళిదాసుని - కావ్యకన్యక
రఘువంశమె - మన రామ చరితము
తులసీదాసుడు - ధన్యత చెందగ
రామచరిత మా - నసను రచించె

రంగనాథుని - అంతరంగమున
అవతరించిన - అయోధ్యపతి కథ
గోపీనాధుని - గుండెల నిండిన
జానకీపతి - జనన చరితము
కవిభాస్కరుని - గంటము నుండి
గలగలపారిన - రామచరితము
మగువమొల్ల - మోదముతో రాసిన
మిధిలానాథుని - అల్లుని చరితము

గాన గంధర్వ - త్యాగరాయుని
గళమున నిల - చిన రామగానము
భక్త కబీరుని - భజనల నిలచిన
భరతాగ్రజుని - భవ్యచరితము
**పంతులవారి - వంశసోముడు**
**జోగరాయుని - పారిజాతము**
ఆ కవులందరి - దీవెనలంది
నే రాసితి శ్రీ - రామ గానము.

# 1 వ సర్గ

## నారదుని, వాల్మీకి, మహాపురుషుని గూర్చి అడుగుట

1. శ్రీ రామాయణ – కల్పతరువుపై
కవికోకిల వా – ల్మీకి రచించిన
రామచంద్రుని - మధుర చరితము
భరతాత్మజుని - భవ్య చరితము
జానకీసతి – జనన చరితము
శ్రీ రామాయణ - గానసుధగ నే
బుధులు చదువగా - రచన జేసితిని
దీవెన లిడగా - కోరుచుంటిని

2. సద్గుణవంతుడు - సత్యవంతుడు
సౌశీల్యుడును – కడు శ్రీమంతుడు
సర్వ ధర్మములు - తెలిసినవాడు
సర్వ శాస్త్రములు - నుడివినవాడు
దృఢ సంకల్పుడు – ధీరోదాత్తుడు
భూతములను – ప్రేమించెడివాడు
కోప రహితుడు - అసూయ రహితుడు
శ్రీకర రూపుడు - గుణసంపన్నుడు

3. కడు ధర్మాత్ముడు - కడు కృతజ్ఞుడు
సర్వ సులక్షణ - లక్షితగాత్రుడు
సురాసురుల - జయించ గలాడు
సదాచారుడు - మోహన రూపుడు
కాంతివంతుడు - కడు ధీమంతుడు
సుందర రూపుడు - సత్యవంతుడు
ధరణియందు గల - డేని తెలుపుమని
నారదుని గని - వల్మీకి వచించెను

నారదుడు వాల్మీకికి రాముని గుణములు చెప్పుట

4. వాల్మీకిని గని - నారదుడిటులనె
అన్ని సుగుణములు - కలిగిన వానిని
ఇలలో గాంచుట - కడు దుర్లభము
ఐనను జెప్పెద - ఆలకించుము
ఇనకుల మందున - దశరథ రాజు
రాజ ఋషులలో - కడు ఉత్తముడు
వర్ణ ధర్మములు - గతులు తప్పక
పాలించెడి కడు - పుణ్యశీలుడు

5, దశరథ భూపతి - ప్రథమ కుమారుడు
రఘురాముడు - నారాయణ తేజుడు
ధనుర్విద్యలో - అగ్రగణ్యుడు
ధర్మ నిరతుడు - సత్య సంధుడు

ఏకసతీ వ్రతు - డార్త శరణ్యుడు
పితృవాక్య పరి - పాలకు డాతడు
శ్రీకర రూపుడు - గుణ సంపన్నుడు
రవితో సముడగు — తేజోవంతుడు

6. కమల పత్రాయత — నేత్రుడాతడు
శోభించెడి సర్వాం — గ సుందరుడు
ఓర్పునందునా — ధరణి సమానుడు
కీర్తియందు దే - వేంద్ర సమానుడు

వర్ణ ధర్మముల — నాచరించెడి
సత్యధర్ముడు - శత్రునాశకుడు
సకల వేదముల - సారమాతడు
సర్వలోక ప్ర - సిద్ధ చరిత్రుడు

7. బాహ్యాంతరములు - శుద్ధి గలవాడు
ఆశ్రిత జన సం - రక్షకు డాతడు
సర్వ సంపదలు - కలిగినవాడు
వ్యసనలకు తా - బాధ నొందడు

అపకారులందు - కృప జూపెడివాడు
గాంభీర్యమున - కడలి యాతడు
కోపమందు కా - లాగ్ని సమానుడు
ధరణి గాచగ వచ్చె - అవతారమూర్తి

8. శ్రీ రఘురాముని - చరిత మంతయు
కడు విశదముగా - పలికె నారదుడు
వీనుల విందుగ - రామ చరితమును
విని వాల్మీకి - కడు మోదముతో

నారదమునికి - పూజలు సలుప
వాల్మీకిడిన — పూజలందుకొని
సంతసించి ఆ - నారదమౌని
అంబర వీధిని - అరిగె నాకము

1 వ సర్గ సంపూర్ణం

# 2వ సర్గ

## వాల్మీకి తమసానదీతీరము జేరుట

9. బాలభానుని - లేత కిరణములు
అన్నిదిశల ప్ర - సరించుట గాంచి
మునివాల్మీకి - స్నానాదుల కని
భరద్వాజుడను - శిష్యుని తోడ్కొని
వనమునందు గల-సొగసులు గాంచుచు
మనమునందు కడు సంతసమొందుచు
తమసానది తట - సీమలందు గల
నిర్మల జలముల - రేవును జేరెను

10. పలుకులు దెమ్మ - నిర్మల జలముల
స్నానాదులను - నే సలిపెదనన
వల్కలంబులు - శిష్యుడీయుగా
కలహభోజనుడు - కడు విశదముగా
వివరించిన శ్రీ - రామ చరితము
కడు మురియ్మన - మనమున మెదలగ
తాపసి వనులకు - గోచరించెను
రతికేళి దేలు - క్రౌంచ మిధునములు

బోయవాడు క్రౌంచపక్షిని జంపుట

11. ఆనందముతో - కమ్మగ కూయుచు
పొదలమాటున - రతి పరవశమున
తేలియాడెడి - క్రౌంచ పక్షులను
గాంచినంతనే - నిషాదుడొకడు
పటు దర్పమ్మున - శరమును వదలగ
పురుష క్రౌంచము - నేలను గూలగ
భర్తను గనిన - ఆడ క్రౌంచము
తల్లడిల్లెను - తప్త హృదయయై

వాల్మీకి నిషాదుని శపించుట

12. అది గాంచిన ఆ - పుట్టపుట్టువుకు
ఎడద ద్రవించి - కలత నొందెను
ఆనందముతో - క్రౌంచ దంపతులు
రతిలో నుండగ - క్రూరాత్ముడవై
పెనిమిటి ద్రుంచిన - ఓ కిరాతుడా
మనజాలవు నీ - వెంతో కాలము
చేసిన పాపము - ఊరకపోదు
అని శాపమిడె - పుట్ట మునివరుడు

13. పుట్టుపుట్టువున - నోటను వెడలిన
వాక్యమంతయు - శ్లోకరూపమై
సమపాదముల - సమాక్షరముల
ఛందోబద్ధమై - లయాన్వితముగా
అతి మధురముగా - గానము జేయుగ
నోటను వచ్చిన - శ్లోకము మరిమరి
ఆనందముతో - వల్లె వేయుచు
మునివరుడెంతో - సంతసమందెను

14. తన మనమున జని - యించిన శోకము
అనుకోని విధి - శ్లోకరూపమై
తన వాక్కునబడ - దాని ప్రభావము
మనసారగ తన - ఎదను దలంచుచు
స్నానాదులను — ముగియించుకొని
ఆశ్రమంబునకు — ఏగె మునివరుడు
భరద్వాజుడు — కలశము నిండుగ
జలము నిడుకొని - చేరె ఆశ్రమము

## బ్రహ్మ వాల్మీకిని జూడవచ్చుట

15. దేవగణంబులు – భక్తితో కొలువగ
రంగుబంగారు – సుందర శిబికను
రాజ హంసలు – చక్కగ మోయగ
వేదనాదములు – శుభ శకునములిడ
ముని వాల్మీకి – ఆశ్రమంబు దరి
అవతరించెను – కమలాసనుడు
నలువను గాంచి – ఆశ్చెరు వందిన
మునివరు డొకపరి – స్తబ్ధుడాయెను

16. తదుపరి క్షణమున – మునినాథుండు
అతుల భక్తి తన – మనమున పొంగగ
ప్రణతు లర్పించి – పూజలు సలిపి
మనసారగ ప్ర – దక్షిణలు జేసి
అర్ఘ్య పాద్యములు – భక్తితో నొసగి
ఆసనమున – ఆసన్నుని జేయగ
నలువ మనమున – సంతస మొందె
కుశలము లడిగె – వాల్మీకిని గని

నలువ, వాల్మీకిని, రామచరితమును రచింపుమని కోరుట

17. దుష్ట నిషాదుడు – దారుణమ్ముగా
పురుష క్రౌంచమును - గూల్చిన
విధమును
పతి మరణమునగని - కడు విలపించెడి
ఆడ క్రౌంచము – రోదించుటయు
తా దిట్టి నది - తన నోటబడి
సుశ్లోకముగా - బయలు వెడలుట
ఎట్టుల జరిగెనో – వివరింపుమని
వాల్మీకడిగెను - అంజలి ఘటించి

18. మునివరోత్తమా - నా అనతిపై
భారతిదేవి - నీ నోట వెడలె
నీవు నుడివినది - శ్లోకమేనని
నాకమునివరుడు - నుడివిన రీతిగ
లోకోత్తరమగు - రామచరితము
శ్లోకరూపమున - రచన జేయుమని
తన అభీష్టము - నెరవేర్చుమని
నలువ కోరె ఆ - పుట్ట పుట్టువును

19. రఘుకులోత్తముని - రామచంద్రుని
చరిత మందున - సకల విషయములు
నీవు గనినవి - కానకున్నవి
గాంచెదవికపై - నా ఆశీస్సులచే
కడు మధురముగా - నీవు రచించెడి
రామ చరితము - లోకోత్తరమగు
వీడు విచారము - నీ మనమ్మున
అని దీవెనలిడె - చతురాననుడు

20. ధరణియందు గల - పుణ్యనదులును
పుణ్య నగములు - నాలుగు శరధులు
ఎంత కాలము - జగతిని గాచునో
అంత కాలము - రామాయణము
ఆదికావ్యమై - ఒప్పుచుండును
ఆదికవిగ నీ - వలరారెద వని
వాల్మీకిని గని - బ్రహ్మదేవుడు
వరము లొసగి - అదృశ్యుడాయెను

2 వ సర్గ సంపూర్ణం

# 3, 4, 5 వ సర్గలు

## అయోధ్యాపుర వర్ణనము

21. సరయూనదీ - తీరమ్ము నందున
వినుతి కెక్కెను - కోసల రాజ్యము
స్వర్గ పురముతో - సమానమైనది
సత్య లోకముతో - సాటియైనది
అలకాపురితో — తుల్యతూగునది
ముజ్జగమ్ముల - పేరొందినది
కోసల రాజ్యపు — రాజధానిగా
అలరారెను అ — యోధ్యా పురము

22. పన్నెండు యోజనాల - పొడవును గలిగి
మూడు యోజనాల - వెడల్పును గలిగి
కడు విశాలమగు - వీధులు గలిగి
శిల్ప సంపదలు - నిండుగ గలిగి
గగన చుంబిత - హేమ సౌధముల
కడు సుందరమగు - గోపురములతో
ఎత్తైన ఎగురు — పతాకములతో
శోభిల్లెను అ — యోధ్యా పురము

23. అతి దుర్గమమగు - ప్రాకారములతో
కడు అగాధమగు - కంధకములతో

ఉన్నతమైన - కోట బురుజులతో
వేనకు వేల మర - ఫిరంగులతో

ఆయుధ యం - త్రాగారములతో
రథ గజ తురగ - పదాతి దళములతో

మంత్రి సామంత - దండ నాథులతో
శోభిల్లెను అ - యోధ్యా పురము

24. రాచవీధుల - రత్నరాసులతో
పలు విధంబులగు - వ్యాపారులతో

కప్పము గట్టు - సామంతులతో
నిపుణత గలిగిన - మహా శిల్పులతో

చిత్రకారులు - మహా నటులతో
అప్సరల బోలు - నర్తకీ మణులతో

ఉత్తమ జాతి - మగువల తోడ
శోభిల్లెను అ - యోధ్యా పురము

25. మణిమయ శోభిత - కాంచనమయమై
పున్నమ చంద్రుని - సరితూగునవి
వైఢూర్యముల - శోభిల్లునవి
స్ఫటిక నిర్మితమై - వెలుగొందునవి
కనక శిల్పముల - నిండియున్నవి
దంతపు పనులతొ - అలరారునవి
నగరమందు గల - కట్టడములతో
అలరారెను అ - యోధ్యా పురము

26. లలిత కళలకు - నిలయము నగరము
కొందరు మృదంగ - నాదము జేయుగ
కొందరు మగువలు-గానముజేయుగ
నాట్యము జేసెడి-కొందరు లలనలు
వాయులీనములు - వీగియులెన్నొ
వాయించెడి మరి - కొందరు మగువల
చందనాగరు — ధూపమ్ములతో
అలరారెను అ — యోధ్యా పురము

27. నాల్గు వేదములు — పఠనము జేయు
వేద పండితులు — ఋషి సమూహములు
సద్గుణవంతులు - సత్యసంధులు
చాతుర్వర్ణులు — ధర్మదాతలు
ముసల ముద్గరా - ద్యాయుధములతో
డాలూ కత్తుల — కరముల దాల్చి
అటునిటు తిరుగెడి - వీర విహారుల
శోభిల్లెను అ - యోధ్యా పురము

28. పలుపలు రకముల - పూదండలతో
కడు ఇంపుగ వెలు - గొందెడి గృహములు
అంతఃపురముల - ఆరామములా
వెండితో పైడితో - మెరయుస్తంబముల
మణిమయ శోభిత - మంటపమ్ముల
వజ్ర ఖచితమగు — ఆసనమ్ముల
క్రీడాచలముల - కేళీ గృహముల
శోభిల్లెను అ — యోధ్యా పురము

29. చిత్రశాలల - చైత్యశాలల
తోటలు తోపుల - పూపొదరిండ్లు
బావులు సరసుల - సుక్షేత్రముల
సుధారసమ్ముతో-సరియగు జలముల
గోసమూహముల - పాడిపంటల
వింత వింతలగు - పక్షులు మృగముల
సిరి సంపదల - ఆట పాటలతో
అలరారెను అ - యోధ్యా పురము

3 4 5 సర్గలు సంపూర్ణం

## 6 వ సర్గ

### దశరథ మహారాజు వర్ణన

30. కోసల దేశము - పరిపాలించెడి
దశరథరాజు - మహాపురుషుడు
వర్ణ ధర్మములు - గతులు తప్పక
పాలించెడి తడు - పుణ్యశీలుడు
కీర్తియందు దే - వేంద్ర సమానుడు
రాజ ఋషులలో - తడు ఉత్తముడు
రాజనీతిని - దప్పనివాడు
సర్వ జనులకు - ప్రీతిపాత్రుడు

31. సింధు కాంభోజ - బాహ్లిక చీనా
వివిధ దేశముల - ఉత్తమాశ్వములు
మహా నగములను-బోలు గజములు
శుభకరములగు - వృషభ రాజముల
కడు బలమైన - ఖరములు ఒంటెలు
వివిధ రకములగు - పక్షి సంతతుల
పలు విధంబులగు - వృక్ష సంపదల
అలరారెను ఆ — దశరథ రాజు

32. స్త్రీలు, పురుషులు - సుందర రూపులు
స్వర్ణ కాంతులను - జిమ్మెడివారు
మంచి ముత్యముల - మణి హారములు
ఇంపుగ మేనున - దాల్చినవారలు
యక్ష గంధర్వ - కిన్నెరాదుల
సొగసు లన్నియు - ఇమిడినవారలు
లోభ రహితులు - భోగపరులతో
అలరారెను ఆ - దశరథ రాజు

33. ఆ నగరంబున - అల్ప గుణులును
విరహితార్థులు - కామపరులును
రోగగ్రస్తులు - అవిద్వాంసులు
నాస్తికులు పా - పిష్టివారును
ఆత్మ వివేక వి - నాశకులును
అల్పభోగులు - అవదాన్యులును
యాగ రహితులు - అసూయాపరులు
కానగరా ర - యోధ్యా పురిని

34. ఆ జిని వీడి - పరుగిడువానిని
ఆ జిని ఓడి - లొంగినవానిని
ఆయుధము లేక - నిలచిన వానిని
ఒంటరివాడై - చిక్కిన వానిని
శత్రువైనను - శరణడిగినచో
అభయ మొసగెడు - ధీమంతులు గల
అయోధ్య నగరిని - పరిపాలించెడి
దశరథ రాజు - మహా పురుషుడు

6 వ సర్గ సంపూర్ణం

## 7 వ సర్గ

దశరథ మహారాజు అశ్వమేధ యాగమును జేయదలంచుట

35. కౌసల్య సుమిత్ర - కైకనామములు
దశరథేశున - కర్ధాంగినులు
వశిష్ట మహాముని - వామదేవులు
ప్రధానమైన - పురోహితులు
అర్థ సాధక - ధృష్టి జయంతులు
విజయు సిద్ధార్థ - అశోకమంత్ర పాల
సుమంత్రాదులను - మంత్రివరులతో
దశరథ రాజు - ఏలెను నయోధ్యను

7 వ సర్గ సంపూర్ణం

## 8 వ సర్గ

36. సిరి సంపదల - తులతూగినను
భోగ భాగ్యముల — తేలియాడినను
సంతతి లేదని - చింత చెందిన
దశరథ రాజు - కడు యోచించి
తన వంశము కడు - వృద్ధి చెందెడి
అశ్వమేధమును - జేయుగ నెంచి
మంత్రి సామంత - దండనాధులను
కుల గురువుల-రప్పించె కొలువుకు

37. పుత్రవరులను — బడయుట కొరకు
వాసిగ వ్రతములు - జేసితినెన్నొ
సకల తీర్థముల — గ్రుంకితి నేను
నా ఆశలు ఫలి - యించగ లేదు
అని మనమున గల - అశ్వమేధమును
గుల గురువగు — వశిష్టునకు దెల్పి
గురు ఆశీస్సులు — శిరమున దాల్చి
మంత్రి సుమంత్రుని - జూచి పలికెను

38. గురు నానతిని — మనమున నిడుకొని
సరయూనది తటి - ఉత్తరమందున
శాస్త్ర నియతిని — వీడకుండగా
రక్షక భటులతో - పురోహితులతో
యజ్ఞభూమిని — నిర్ణయింపుడని
యజ్ఞశాలను — లక్షణరీతిని
అతి త్వరితముగా - నిర్మింపుడని
మంత్రి సుమంతుని - జూచి పలికెను

39. శాస్త్రబద్ధముగ - శాంతి క్రియలను
ఎల్లవేళలా - జరుపవలయును
అపరాధములు - జేయుగరాదు
విఘ్నంబులు కలి - గింపగ రాదు
యాగ క్రమమున - దోషము లుండిన
యజ్ఞకర్త అట - అసువులు వీడును
కావున గురువులు-ఋత్విజులందరు
శాస్త్ర పద్ధతిని - క్రతువు నడుపుడనె

40. ఆటుల పలికెడి-దశరథుని గని
ఓ మహరాజా - ఓయి మహాత్మా
పుణ్య పురుషులు-జేయుకార్యముల
విఘ్నము లెన్నడు - పొడగాంచవని
అయినను మేము - సమర్థత తోడ
నిర్వహించెదము - యాగము శాంతము
అని నరనాధుని - అనుమతిని గొని
వెడలె మంత్రులు-మందిరములకు



41. అంత దశరథుడు - గురుసత్తముల
అనుమతి గైకొని - ఆనందముతో
తన మందిరము - జేరిన పిమ్మట
ముగ్గురు సతులను - జేర బిల్చుకొని
సంతతి బొందగ - అశ్వమేధమను
యాగము జేయగ - నిర్ణయించితిని
గావున మీరును - దీక్ష బూనుడన
ముగ్గురు సతులు - మురిసిరంతట

8 వ సర్గ సంపూర్ణం

## 9 వ సర్గ

సుమంత్రుడు దశరథ భూపతికి సనత్కుమారుని
వచనములు దెల్పుట

---

42. మంత్రి సుమంత్రుడు - ఒక దినంబున
ఏకాంతముగా - దశరథేశునితో
పూర్వమందున - ముని సభయందు
భూత భవిష్యత్ — వర్తమానములు
దెలియ జెప్పగల - సనత్కుమారుడు
అశ్వమేధమును - మీరు జేతురని
సంతతి మీరు - బడయుగలరని
ప్రస్తావించుట - నే వినియుంటిని

ఋ ష్య శృం గు ని వృ త్తాం త ము

43. కాశ్యపు డనెడి - ఋషి సత్తముని
పుత్రివర్యుడు - విభాండకుండు
అతని సుపుత్రుడు - ఋష్య
శృంగు
వనాంతరంబుల - పెరిగినవాడు
మగువల నెన్నడు - జూడనివాడు
విషయ వాంఛలు - తెలియునివాడు
బ్రహ్మచర్యమున - భాసిలువాడు
నిత్య సువ్రతుడు-ఋష్యశృంగు

రో మ పా దు ని చ రి త్ర

44. ఆ సమయంబున - అంగదేశమును
అతి బలశాలి - కడు దర్పుడగు
రోమపాదుడను - ధరణీనాథుడు
ధర్మము వీడి - ఏలుచుండెను
ధర్మ దేవతను - వీడుటచేత
బహు వత్సరములు - వానలు లేక
భువిని క్షామము - తాండవించెను
దేశ ప్రజలు - అల్లాడిపోయిరి

45. అతి దుర్భరమగు - క్షామము గాంచి
రోమపాదుడు - కడు చింతించి

ధర్మము వీడి - పాపినైతినని
ఆ క్షామమునకు - తా కారణమని

వేదశాస్త్ర చయు - కోవిదులైన
పండితోత్తముల - రావించుకొని

దోషము తొలగెడి - దారి జూపుమని
మరి మరి వేడెను - రోమపాదుడు

46. విభాండక ముని - ప్రియ కుమారుడగు
ఋష్యశృంగుని - తపోగరిష్టుని

యోచన జేసి - రావించుకొని
ఉచిత రీతిని — సత్కరించుడని

కడు గుణవతియు - రూపవతియగు
రాజకుమారిని — శాంతాదేవిని

ఋష్యశృంగునకు-పాణిగ్రహణము
సలుపవలెనని - విజ్ఞులు దెల్పిరి

47. విజ్ఞులు నుడివిన - సూచనను విని
రోమపాదుడు - సంతసమొంది

మంత్రి పురోహిత - దండ నాథులతో
ఋష్యశృంగుని - గొని తెమ్మనెను

ఆ మాటలు విని — వారలందరు
భయ కంపితులై — ఇటుల పలికిరి

ఋష్య శృంగుని - గొని తెచ్చినచో
విభాండకుండు - మము శపించును

48. మాకు సాధ్యము — కాని మార్గము
వేరొకటున్నది — అది నుడివెదము

రతి క్రీడలలో — ఆరితేరిన
వారకాంతలను - అటకు పంపిన

వారికి లోబడి — ముని సుతుడంతట
మన రాజ్యములో - అడుగిడవచ్చును

అపాయము లేని - ఉపాయమిదేనని
విజ్ఞులు దెలిపిరి — రోమపాదునకు

9 వ సర్గ సంపూర్ణం

# 10 వ సర్గ

వారకాంతలు ఋష్యశృంగుని తోడ్కొని వచ్చుట

49. నరపతి ఆనతి - శిరమున దాల్చి
కడు సుందరులగు - వారకాంతలు
విభండకముని - లేని సమయమున
ఆశ్రమవాటిక - జేరెరందరు
ఋష్యశృంగుని – గాంచినంతనే
పొదలమాటున – పొంచి యుండిరి
పూలను గోయగ - ఋష్యశృంగుడు
బయటకు రాగ – వేశ్యలు జేరిరి

50. వీణాతంత్రులు – మీటిరి కొందరు
మృదంగ నాదము - సలిపిరి కొందరు
నృత్య గీతములు – జేసిరి కొందరు
మోదము గూర్పగ - జేరిరి కొందరు
స్తనముల నిచ్చి – కౌగిట జేర్చిరి
వనములలోన - లేని ఫలములని
ఋష్యశృంగుడు-కడు పరవశమున
ఆస్వాదించెను – వారి స్తనములు

51. ఘోరాటవిలో – ఒంటిగ నీవు
జరియించుటకు - కారణమేమని
అతి మధురముగా - అడిగె వనితలు
వారకాంతలను - ఋషులే అనుకొని
విభాండక మౌని - ప్రియ తనయుడను
ఋష్యశృంగుడని - వరలువాడను
వనాంతరముల - పెరిగినవాడను
అని పిలచెను తన - ఆశ్రమమ్మునకు

52. అర్ఘ్యపాద్యముల - పూజలు చేసెను
ఫలముల నెన్నో – ప్రీతిగ నొసగెను
విభాండకుండు - వచ్చు వేళగని
వారకాంతలు - వేగమె మరలిరి
వారిని మదిలో - మరిమరి తలచుచు
మదన తాపమును - చెందినవాడై
నిలకడ లేక - అటునిటు తిరుగుచు
వారికొరకు వీ – క్షించుచుండెను

53. జప తపములందు - నిలకడ కుదరక
మరునాడంతట - ఋష్యశృంగుడు
ఏగిన వేశ్యలపై - మరులు గొన
మదన తాపమున-ఒడలు మరుగగా

ముందురోజున - కలసిన తావుకు
వడివడి వెడలెను - వేశ్యల గాంచగ
అటుల వచ్చెడి - ఋష్యశృంగు గని
తమకు లొంగెనని-వేశ్యలు మురిసిరి

54. కాలి అందియలు - గలగలలాడగ
కర కంకణములు - స్వరములు ఇడగ
చెంతకు చేరి - కడు కవ్వించి
గతము కన్న ఈ - నాడు మిన్నగా

నిన్ను మేము కడు - సత్కరింతుమని
మా సదనములకు - మాతో రమ్మని
పలుపలు రీతుల - మోహితు జేసి
అంగదేశముకు - తోడ్కొని పోయిరి

ఋ ష్య శృం గు డు అం గ దే శ ము న అ డు గి డు ట

55. ఆనందములో - ఋష్యశృంగుడు
అంగదేశమున - అడుగిడ నంతనె
గగన భాగమున - కారు మేఘములు
కడు దట్టముగా - అలముకున్నవి
ఘర్జన జేయుచు - మెరపులు మెరయుచు
కుంభవృష్టిగా — కురిసె వానలు
నదీ నదములు - బావులు సరసులు
తృప్తిగ నిండి - పొంగి పొరలెను

56. రోమపాదుడు - ఎదురుగ వచ్చి
ఋష్యశృంగునికి - స్వాగతమిడెను
అర్ఘ్యపాద్యములు-పూజలు సలిపెను
మోసముచే ర - ప్పించినందులకు
మన్నింపుమని — మరిమరి వేడి
సద్గుణరాసి - సౌశీల్యవతి
తన సుతయగు - శాంతాదేవిని
పరిణయమాడగ - కోరె వినయముగ

## శాంతా ఋష్యశృంగుల వివాహము

57. రోమపాదుని — కోరిక మేరకు
ఋష్యశృంగుడు - సమ్మతించగా
మునులు జనులు కడు - మోదమందగా
శుభముహూర్తమున - నరపతి యపుడు
తన సుత శాంతనిడి - ఋష్యశృంగునకు
కడు వైభవముగ - పెండ్లి జేసెను
శాంతా దేవితో - ఋష్యశృంగుడు
సుఖశాంతులతో - కాలము గడపెను

58. జనులందరు కడు - ఆనందముతో
పాడిపంటల - ధన ధాన్యాలతో
క్షామముడిగి కడు - హాయిగ నుండగ
ప్రజలందరను — కన్న బిడ్డలటు
రోమపాదుడు — రాజ్యమేలెను
అని వివరముగా - తాను వినినది
తిలకించినది - వివరించెను ఆ
మంత్రిసుమంత్రుడు-దశరథేశునితో

59. కావున నీవు - ఋష్యశృంగుని
రావించుకొని - క్రతువు జరిపిన
వంశ తిలకులగు-నల్వురు పుత్రులు
బడసి నీవు కడు - ధన్యుడగుదువు
సనత్కుమారుని - పలుకులన్నియు
యథావిధిగ ఇక - జరిగి తీరునని
మంత్రి సుమంత్రుడు - దశరథ రాజుని
గాంచి పలికెను - కడు మధురముగా

(10 వ సర్గ సంపూర్ణం)

## 11 వ సర్గ

60. మంత్రి పలికిన - శుభకరములగు
వాక్కులు వినిన - దశరథేశుడు
ముగ్వురు సతులను - ముని వశిష్ఠుని
మంత్రి పురోహిత - దండనాథుల
తగు పరివారము - వెంట నిడుకొని
వనములు పల్లెలు - వివిధ వాహినులు
నగరములు పురములు - నతిక్రమించుచు
రోమపాదుని - రాజ్యము జేరెను

కోసలేంద్రుడు - వచ్చుట తెలిసి
రోమపాదుడు — ఎదురుగ నేగి

దశరథాదులను - సన్మానించెను
రోమపాదుని - రాజ సౌధమున

నిర్మల తేజుని - సచ్చరితుని
నిత్యకర్మ దీక్షా - పరతంత్రుని

ఋష్యశృంగుని - గని దశరథుడు
మనమునందు - కడు సంతసించెను

32. రోమపాదుడు - ఋష్యశృంగు గని
దశరథ రాజు — నాకు బంధువు

తన కుమార్తెయగు - శాంతాదేవిని
నాకు తనయగా - జేసినవాడు

నేనెటు మామనో - ఇతడు మామయగు
అని పలికిన తన - మామ మాట విని

ఋష్యశృంగుడు - శాంతాదేవియు
అయోధ్యపతికి - అంజలులిడిరి.

దశరథుడు రోమపాదునితో తన మనోభీష్టము తెలియజెప్పుట

63. వంశోద్ధారకులు - గు పుత్రులను
బడయుట కొరకు — అశ్వమేధమును
యాగము జేయుగ - నిర్ణయించితిని
ఆ క్రతువును నెర - వేర్చ గలాడు
నీ యల్లుడగు — ఋష్యశృంగుడు
కావున శాంతా — ఋష్యశృంగులను
నా పురమునకు — నాతో బంపి
కోర్కె దీర్చుమని — కోరె దశరథుడు

64. సంతతి కొరకై - క్రతువు జేయుగా
శాంతాదేవికి — జనక పితయైన
అయోధ్యాధిపతి - ఏగుదెంచెను
క్రతువును నీవు — సఫలము జేయుగ
మామ దశరథుడు - కోరుచున్నాడు
శాంతయు నీవు - నయోధ్యకు బోయి
వారి కోరికను - సమ్మతింపుమని
రోమపాదుడు - కోరె అల్లుని

65. తన మామయగు - రోమపాదుని
విన్నపము విని - ఋష్యశృంగుడు
సమ్మతించెను - కడు మోదమ్మున
దశరథేశునకు - పూజలు సలిపి
తన ప్రియ సతియగు - శాంతాదేవితో
వేదపండితుల - వేదనాదముతో
మంగళ ధ్వనులు - మిన్నుముట్టగా
పయనించెను - అయోధ్యపురికి

66. అయోధ్యాపురి — వీధులన్నియు
సొంపగు ముగ్గుల - తీర్చిదిద్దిరి
సురుచిరంబగు - తోరణాలతో
గృహములన్నియు - అలంకరించిరి
మంగళధ్వనులు - మిన్నుముట్టగా
శాస్త్ర సమ్మతిని - ఋష్యశృంగుని
బహు విధంబుల - పూజలు సలిపి
అంతఃపురమున - కాహ్వానించిరి

67. శాంతాదేవి - ఋష్యశృంగుడు
పరిచారికల - సేవలందుచు
ఆనందముగా - గడపుచుండెను
పుణ్యదంపతుల - పాద స్పర్శతో
అయోధ్యపురము - పావనమాయెను
అని కడు మోదము - నొందిరి జనులు
మధుమాసంబున - యజ్ఞారంభము
శుభప్రద మనె - ఋష్యశృంగుడు
(11 వ సర్గ సంపూర్ణం)

## 12 వ సర్గ

దశరథుడు ఋష్యశృంగునితో యజ్ఞారంభము జేయుమని కోరుట

68. మధుమాసంబున - దోషరహితమగు
పూర్ణిమ దినమున - దశరథరాజు
ఋష్యశృంగునికి - వరణంబిచ్చి
యజ్ఞారంభము - గావింపుడని
మరిమరి వేడెను - కడు విధేయతను
యాగము జేయుగ - వలసినవన్నియు
కడు సమృద్ధిగా - సమకూర్చుడని
పురోహితులతో - రక్షకభటులతో
యజ్ఞాశ్వమును - వదలవలెననె

69. వామదేవ జా - బాలి కాశ్యప
సుయజ్ఞాదులు - భూసురోత్తములు
సుమంత్రాదిగ - అష్టమంత్రులు
ఋష్యశృంగ వ - సిష్టాది ఋషులు
దశరథేశుని - ప్రస్తుతింపగా
మీ కృప కటాక్ష - వీక్షణాలను
నాపై జూపిన - సంతతి బడతును
అని వారలకు - ఉంజలి ఘటించె

70. తలచిన కార్యము - సఫలమగునని
నలుగురు పుత్రుల - బడయుగలవని
నీ జననమిక - సార్థకమగునని
సురుచిర కీర్తిని - పొందెద వీవని
దశరథుని గని - ఋష్యశృంగుడు
ప్రీతిగ పలికి - దీవెనలిడగా
శుభముహూర్తమున - యువనాశ్వమును
వదలినారు కడు - ఉత్సాహముతో

(12 వ సర్గ సంపూర్ణం)

## 13 వ సర్గ

71. యువనాశ్వమును - వదలిన పిమ్మట
మరో వసంతము - వచ్చు సమయాన
ముని వసిష్టుని - ఆనతి మేరకు
శిల్పకారులు - చిత్రకారులు
నాట్యాచారులు - మహానటులును
వేనకు వేల — కార్మికులెందరో
వాసయోగ్యమగు - గృహములనెన్నో
యజ్ఞముకై ని - ర్మించిరి పురము

72. ఆహ్వానములు - అందిన వెంటనె
మిథిలానాథుడు - రోమపాదుడు
కాశీ నరపతి - కేకయరాజు
మగధ కోసల - మహారాజులు
కురుపాంచాల - ధరణీపతులు
దక్షిణదేశపు - నృపతులెందరో
రత్నరాసులు . పలు కానుకలు
దశరథునకు నగిరి - యజ్ఞము కొరకు

73. యజ్ఞార్థము - నిర్మించిన పురము
కలకలలాడెను – బంధు జనులతో

సరయూ తీరము - కిటకిటలాడెను
వసతులన్ని కడు - సౌకర్యములతో

కుదిరెను నూతన - పురము నందున
భక్ష్య భోజ్యముల – నారగించిరి

ప్రీతిగ పొంది – సన్మానములు
చాతుర్వర్ణ్యులు - తృప్తిని బొందిరి

74. నిర్ణయించిన - శుభ ముహూర్తమున
మంగళ ధ్వనులు - మారుమ్రోగగా

స్వస్తి వచనములు - పలుకుచుండగా
వసిష్ఠాది ద్విజ - పుంగవులెందరో

వెంట నడువగా – దశరథేశ్వరుడు
ప్రవేశించెను – యజ్ఞవాటికను

ఋష్యశృంగుడు - వేదోక్తముగా
అశ్వమేధమును – ఆరంభించెను

13 వ సర్గ సంపూర్ణం

## 14 వ సర్గ

75. అటుల వత్సరము - గడచిన పిమ్మట
దేశ దేశముల - తిరిగిన అశ్వము
సరయూనది తటీ - తీరమందు గల
యజ్ఞ వాటికను - ప్రవేశింపగా
ముని ఆజ్ఞను గొని - అట బంధించిరి
కల్పసూత్ర విహి - తాను సారముగ
క్రమము తప్పక - సర్వకర్మల
అశ్వారాధన — గావించితిరి

76. విఘ్నము లేవియు - కలుగకుండగ
దోషము లేవియు - దరి రాకుండగ
కర్మ దేవతల - కడు ప్రార్థించి
ప్రాతస్సవనము - ప్రీతిగ జేసి
హవిర్భాగము - సురపతికిచ్చి
సోముని కడు - రీతి స్తుతించి
అటు పిమ్మట మా - ధ్యందిన సవనము
తృతీయంబుగా - పూర్తి జేసిరి

77. యాగశాస్త్ర వి - జ్ఞాన తతులగు
ఋత్విజులంత — యజ్ఞ వేదికకు
మధ్య భాగమున - ఇరువదియొక్క
యూపసంస్థితి - అలరారగజేసి
ఉత్తమాశ్వమును - జలచరములను
పన్నగములను - జంతు సంతతుల
మూడు శతముల-గ్రామపశువులను
యూపంబులకు - వరుసగ గట్టిరి

78. పదియు ఎనిమిది - ఇటుకల తోడ
అగ్ని కుండమును - వేదోక్తముగా
అట నిర్మించిరి - కడు నేరుపుతో
స్తంభములకు - బంధింపగ బడిన
మూడు నూరుల - గ్రామ పశువులను
యాగాశ్వమును - విశసము జేయుగ
దశరథేశుని - పట్టపురాణి
కౌసల్యాసతి - అట కేతెంచెను

79. కడు వినయముగా - యువనాశ్వమునకు
పూజలు సలిపి - ప్రదక్షిణలు జేసి
హేమఖడ్గమున - విశసనము జేసి
ధర్మసిద్ధికై - స్థిరచిత్తముతో
రేయి గడిపె - మృతాశ్వము చెంత
మరసటి దినమున - అశ్వమేధస్ను
హుతాసునకు - హోమము జేయ
అగ్ని కుండమున - దూప వెంగ సెను

80. దశరథ నరపతి - దూపము పీల్చెను
అటు పిమ్మట - పదియారు ఋత్విజులు
మంత్ర విధిని - శాస్త్రానుసారముగ
అశ్వాంగములను - హోమము జేసిరి
చతుష్టోమమును - తొలి దినంబును
ముకల్యంబు ద్వి - తీయ దినంబును
మతిరాత్రంబు తృ - తీయ దినమును
క్రమముగ జరిపిరి - వేదోక్తముగా

దశరథ మహారాజు భూదానములు జేయుట

81. తూర్పు భాగము - హోతకునిచ్చెను
ఉత్తరభాగ ము - ద్గాతకు నిచ్చెను
పడమటిభాగ ము - ధ్వర్వ్యున కిచ్చెను
దక్షిణ భాగము - బ్రహ్మకు నిచ్చెను
రాజ్యమెల్ల బు - త్విజులందరకు
దానమిచ్చెను — దశరథ రాజు
దానములందిన - బుత్విజు లందరు
దశరథేశునితో - ఈ విధి పలికిరి

82. ప్రజలందరినీ - కన్నబిడ్డలటు
కంటికి రెప్పలె - కాపు గాచెడి
ధరణీ పతులకె - భూమండలము
తాపసులగు - మాకేల ఈ ధరణి
దానము చేసిన — సకల ధాత్రిని
నీవే గైకొని - ధర్మ నిరతిని
ధరణికి బదులు - తోచినదిమ్మని
ప్రీతిగ విడచిరి - భూభాగములను

83, వారి అభీష్టము - దీర్చ నెపమ్మున
రత్నరాసులు సు - వర్ణరాసులు
గోసహస్రములు - దానము జేయు
ఋత్విజులందరు - ప్రీతిగ గైకొని
ఋష్యశృంగ వ - సిష్టాదుల గాంచి
కానుకలుగ మన - కందిన సంపద
మిగిలినవారికి — పంచుడని కోర
తృప్తి మీరగా - ధనములు పంచిరి

84. స్వర్ణ గోరత్న - ధనరాసులను
ద్విజావళి కెల్ల - పంచె దశరథుడు
కడు పేదయగు - బ్రాహ్మణోత్తముడు
దశరథుని గని - యాచించినాడు
చివరకు మిగిలిన - కర కంకణమ్ము
ద్విజున కొసగెను - దశరథ భూపతి
వేదోక్తమగు - ఆశీస్సులతో
జయజయ ధ్వనులు - నింగిని తాకెను

85. దశరథు డంతట - పులకితుడాయెను
ఆనందాశ్రులు - రాల్చెను జలజల
నా పాపముల - పరిహారార్థము
అశ్వమేధమును — జరిపించితిరి
వంశవృద్ధి గా - వించు సుతులను
పొందుట కొరకు - క్రతువేదయినా
ఇకపై సలిపి — కృతార్థు జేయుడని
కడు వినయముగా - పలికె దశరథుడు

86. అటు అర్థించిన — దశరథుని గని
ఋత్విజులందరు — సంతస మొందిరి
ఋష్యశృంగుని - అనతియమున
పుత్రకామేష్టి - క్రతువును జేసిన
విపుల ధర్మములు — శాశ్వత కీర్తులు
నలువురు కొమరుల - బడయగలవని
ఋష్యశృంగుడు - ఆశీస్సులు నిడ
దశరథుని మది - పొంగి పొరలెను

(14 వ సర్గ సంపూర్ణం)

# 15 వ సర్గ

## దశరథుడు పుత్రకామేష్టి యాగము జేయుట

87. హోమతంత్రము - ధర్మోక్తముగ
నిర్వహించుట - మొదలిడి నంతనె
అష్టదిక్కుల - అధిపతులందరు
బ్రహ్మాదులు బ్రి - హ్మర్షి పుంగవులు
తమకు చెందెడి - హవిర్భాగముల
గైకొని సంతృ - ప్తిని బొందిరి
అట కేతెంచిన - నలువను గాంచి
సురలు దెల్పిరి - తమ ఆపదలను

88. రావణాసురుడు — రాక్షస రాజు
వరములచే కడు - బల గర్వితుడై
లోకములను - బాధించుచుండెను
అష్టదిక్కుల - నాయకు లందర
వారి నెలవుల - పారద్రోలెను
యజ్ఞ యాగములు - భగ్నము జేయుచు
జనులందరు - కడు భీతి జెందగా
పృధివియందు కడు - కంటకుడాయెను

బ్రహ్మ దేవతలతో ఈ విధి పలికెను

89. వర గర్వంబున - దిక్పాలకులను
తన బానిసలుగ - జేసె రావణుడు
వానికి భయపడి - సంద్రుడు పొంగడు
పవనుడు భీతిలి - విసురుగ వీవడు
లోక బాంధవుడు - వేడిమి జూపడు
నుడు కాంతుడు - తన కాంతి జూపడు
దేవరాజు చిం - తాలస చిత్తుడై
తిరుగుచున్నాడు - దైత్యుని దాటికి

90. లంకానాథుని - ప్రేరణచేత
బలోపేతులగు - రక్కసు లందరు
కామరూపములు - దాల్చినవారై
వివిధ బాధల - మము గురిజేయుగ
ధృతిచెడి మేము - తిరుగుచుంటిమి
సకలకార్యములు - మాంద్యముదాల్చెను
అని సురలందరు - సలువ నడిగిరి
లంకానాథుని - వధకు నుపాయము

## బ్రహ్మ దేవతలకు రావణు జంప నుపాయము జెప్పుట

91. రావణాసురుడు - దీక్షను బూని
కడు వత్సరములు - తప మొనరించెను
వాని తపమునకు - నే మెచ్చితిని
యక్ష గంధర్వ - కిన్నెరాదుల
ఫణి విద్యాధర - సిద్ధసాధ్యుల
వలన మరణము - లేని వరమందె
నర వానరులు - అల్పులని తలచి
వారిని విడచెను - బల గర్వమున

92. కాన రావణుడు - అంత మొందును
నర వానరుల - హస్తమందున
అనెడి రహస్యము - బ్రహ్మ నుడువగా
సుర లందరును - సంతస మొందిరి
ఆ సమయాన - ప్రత్యక్షమాయెను
శంఖచక్ర గ - దాయుధ ధరుడు
వక్ష స్థలమున - కౌంస్తుభమ్ముతో
దివ్యతేజుడు - రమావల్లభుడు

93\. కాంచన చేలము - కడు మెరయంగ
సుమమాలలను - దాల్చి రమాపతి
బ్రహ్మచెంత ఆ - సీనుడాయెను
సురలు మునులును - శ్రీహరి జేరి

ఋషిగణముల హిం - సించు చుండెనని
దిక్పాలుర ద్వే - షించు చుండెనని
అంజలి ఘటించి - స్తోత్రము జేసి
రక్షణ వేడిరి - రమానాథుని

( 15 వ సర్గ సంపూర్ణం )

## 16వ సర్గ

94. నీరజనాభ - రమావల్లభా
అయోధ్యాధిపతి - దశరథరాజు
తనయుల కొరకై - పుత్రికామేష్టి
జన్నమిప్పుడీ - పుడె అరంభించెను
అతనికి గలరు - ముగ్గురు సతులు
కౌసల్య సుమిత్ర - కైకేయాదులు
నరుని రూపు గొని - వారి గర్భముల
అవతరింపుమని - వేడిరి సురలు

శ్రీ మహావిష్ణువు దేవతలకు అభయమిచ్చుట

95. అటుల వేడెడి - సురలను గాంచి
భయమొందకుడు - శుభమగు మీకు
మీ కోరికను దీ - ర్చ నెపమ్మున
దశరథునకు నే - నలుగురు సుతులుగ
అవతరింతు ఈ - ధరణి యందున
పాపుడైనట్టి - రావణాసురుని
పుత్రుల, పౌత్రుల - బంధు మిత్రుల
దెగటార్తును నే - ఘోర రణమున

96. అటు పిమ్మట ఈ - ధరణి యందున
ధర్మ రక్షణ - జేయుట కొరకు
పదకొండువేల - యబ్దములేలి
రామరాజ్యము - స్థాపించిన పిమ్మట
రమ్యగతిని నే - తిరిగి వత్తును
వైకుంఠమును - జేరుకొందునని
అనిమిషులకు తా - నభయమొసంగి
అంతర్ధానము - జెందె రమాపతి

దివ్య పురుషుడు పాయస పాత్రతో
అగ్ని గుండము నుండి బయలు వెడలుట

---

97. అరుణ కాంతులతో - దేహము మెరయు
శిఖి ప్రభలచే - కాంతులు నిండిన
మహాబలుడు సు - లక్షణతేజుడు
మహాశూరుడు మహాతేజుడు
మహా నగమును - బోలినవాడు
దివ్య పురుషుడు - పాయస పాత్రతో
అగ్ని గుండమున - బయటకు వచ్చి
దశరథేశునకు - దర్శనమిచ్చెను

## దివ్య పురుషుడు దశరథునితో

98. ప్రజాపతి ఈ – దివ్య పాయసము
నీకు నీయుగా – నన్ను బంపెను
పాయసాన్నమును – ముప్పేరు సతులకు
నీ కోరిన రీతిని – పంచి ఇమ్మనెను
నీవు సుపుత్రుల – బడయగలవని
రఘువంశము వ – ర్ధిల్ల గలదని
హేమమయమగు – పాయస పాత్రను
దశరథున కిచ్చె – దివ్య పురుషుడు

99. యజ్ఞ పురుషునకు – అంజలి ఘటించి
పాయస పాత్రను – చేకొని సంతసనె
దివ్య పురుషుడ – దృశ్యుడాయెను
ధన హీనునకు – ధనము లభించిన
పగిది దశరథుడు – సంతసమొందెను
పాయస కలశము – శిరమున నిడుకొని
ముప్పేర సతులను – గూడి నరేంద్రుడు
నిజ ధామమునకు – అరిగె నప్పుడు

100. ముప్పు్వ రప సతులను - ప్రేమగ పిలచి
దివ్య పాయసము - కడు ముదంబున
కౌసల్యకు నిడె - సగ భాగమును
శేష పాయసము - సగము సుమిత్రకు
మిగిలిన సగమున - అర్థ భాగమును
చిన్న భార్య కై - కేయికి నొసగెను
అందు మిగిలిన - భాగమంతయు
సుమిత్ర కొసగె - దశరథు డంతట

101. యాగవిధిని సం - ప్రీతిగ జేసి
యాగమునకు అరు - దెంచిన వారిని
ప్రీతిగ బంపెను - వారి నెలవులకు
తనకు అల్లుడగు - ఋష్యశృ - గుని
కడురీతిని స - త్కారము జేసి
బహుమానములు - మెండుగ నీయగ
శాంతాదేవితో - ఋష్యశృంగుడు
అరిగె నప్పుడు - అంగదేశముకు

102. గరుడ గంధర్వ - కిన్నెరాదులు
యక్షులు నాగులు - దిక్పాలురును
సంతసమందిరి - దశరథుని గని
గురువులు మంత్రులు - తన పరివారము

వెంట నడువగా - దశరథ రాజు
ఆనందముతో - అయోధ్య జేరెను

దివ్య పాయసము - గ్రోలిన రాణులు
నవ్య కాంతులతో - గర్భము దాల్చిర్
103. గర్భము దాల్చిన - సతులను గాంచి
దశరథరాజు - కడు మోదముతో

ధర్మపత్నులను - క్షణము విడువక
తారకరాజిని - నిరంతరంబు

వీడనివాడగు - నుడురాజు వలె
ఉత్తేజమున - దీప్తియందునా

సురరాజగు ఆ - ఇంద్రుని పోలె
ప్రకాశించెను - అయోధ్యాధిపతి

(16వ సర్గ సంపూర్ణం)

# 17 వ సర్గ

బ్రహ్మ వానర వీరులను శృజింపవలయునని దేవతలకు దెలుపుట

---

104. నారాయణుడు - నరుడై జనించు
ధరణీతలమును — కాపాడుటకై
కడు బలశాలుర - నీతిమంతుల
శౌర్యవంతుల - రణోత్సాహుల
వాయువేగుల - విష్ణు సమానుల
విభుని కార్యము - దీర్చు నేపమ్మైన
వానర వీరుల - శృజియింపుడని
సురలందరకు - నలువ జెప్పెను

105. వనజభవుండు — అటుల దెలుపగ
దేవగణంబులు — సమ్మతి జూపి
వనచర కాంతల - సుర విలాసినుల
కిన్నెరాంగనల - నాగనారుల
యక్ష కింపురుష - కాంతల యోనుల
పాభవ మొప్పగ - సృష్టి జేయగా
సంచరించె వన - పర్వత కానన
భూములందు ఆ - సుర లందరును

106. బ్రహ్మ సృష్టించె - జాంబవంతుని
సురపతి అంశను - వాలి జనించె
దినకరునకు సు - గ్రీవుడు బుట్టెను
అగ్ని హోత్రునకు - నీలుడుదయించె
వాయుదేవునకు - మారుతి కలిగె
వరుణునకు సు - షేణుడు బుట్టె
విశ్వకర్మకు - నలుడుదయించె
దేవగురునకు - తారుడు పుట్టె

107. యక్షునకు కలె - గంధమాధనుడు
పర్జన్యునకు - శరభుడు పుట్టె
అశ్విని దేవతలు - తమ అంశము
మైందుని ద్వివిదుని - సృష్టి జేసిరి
ఈ విధంబుగా - పెనకు వేల
వానర వీరులు - ధర జనియించి
కొండ కోనల - తిరుగాడుచును
రాముని రాకకు - వేచియుండిరి

108. మహా నగములను - పద ఘట్టనలచె
నుగ్గు గావించు - వజ్ర శరీరులు
ఘన భూరుహముల - కూకటివ్రేళ్ళతో
పెకళించగల - భుజబలతేజులు
నఖముల కోరల - మృగరాజువైన
చీల్చి చంపగల - వానరయోధులు
ఇంద్రసుతుని తమ - ఏలికగా గొని
నెలకొని యుంటిరి - గహన భూముల

(17 వ సర్గ సంపూర్ణం)

## 18 వ సర్గ

109\. కమలనాభుని - గర్భకోశమున
దాల్చి యున్నట్టి - దశరథ సతులు
మందగమనులై - నడచు చుండిరి
ముఖ పద్మములు - కళలతో నిండెను
నిట్టూర్పులంత - అధికమాయెను
స్వరములంత మం - దముగ పలికెను
దేహకాంతులు - దీప్తి చెందెను
శుభ లక్షణములు - అన్నియు నేర్పడె

110\. నవమాసములు - నిండిన పిమ్మట
చైత్ర శుద్ధ నవ - మి తిథియందున
బుధవారము - పునర్వసు తారన
పంచ గ్రహములు - ఉచ్చలోనుండ
తారాసతి పతి - గురునితో నుండ
కర్కాటక లగ్న - మున జనించెను
శ్రీహరికి అర్ధాం - శ సంభవుడు
కౌసల్యకు రాము - డను సుపుత్రుడు

111. మరసటి దినమున - పుష్యమి తారన
సుక్షేమత మగు - మీన లగ్నమున
శ్రీహరికష్టమ - భాగమై వరలు
నిర్మల చరితుని - సద్గుణవంతుని
బుద్ధిమంతుని — సత్యసంధుని
కైకేయి కనె — భరత కుమారుని
రాముని బోలు - శ్యామ శరీరుడు
అనుజులందునా - రెండవవాడు

112. "ఆ మరునాడు ఆ - శ్లేష తారలో
మధ్యాహ్నంబు - సమయ మందున
కర్కాటక ల - గ్న మందున
సుమిత్రి కనెను - పుత్రిద్వయంబును
లక్ష్మణ శత్రుఘ్ను - లనెడి వారను
నారాయణ శే - షాంశ సంభవులు
సర్వ సులక్షణ - లక్షిత జాతులు
తేజోమూర్తులు - మహానుభావులు"

113. రామలక్ష్మణ - భరత శత్రుఘ్నులు
పృథివియందు జని - యించి నంతనే
సుర దుంధుభులు - మారుమ్రోగెను
సుమ వర్షమ్ములు - మెండుగ కురిసెను
అప్సరలంతట - నాట్యము లాడగ
గంధర్వాదులు - గానము జేసిరి
అమరుల కంత - భయము తీరెను
దైతేయులు కడు - తల్లడిల్లిరి

114. అయోధ్యపురిని - కడు అందముగా
పలుపలు విధముల - అలంకరించిరి
నట గాయకులు - నర్తకీమణులు
ఆట పాటల - తేలియాడిరి
కనుల పండువుగ - రాజమార్గములు
కిటకిటలాడెను - జన సమూహముతో
మంగళకరమగు - జయ నినాదములు
అంబర వీధిని - అధిగమించెను

115. త్రయోదశి దినమున - రాకొమరులకు
నామకరణమును – జేసె వసిష్టుడు
అగ్రతనయునకు - శ్రీరాముడని
ద్వితీయ సుతునకు - భరతుండనియు
తృతీయ సుతునకు - లక్ష్మణుండనియు
చతుర్థ సుతునకు - శత్రుఘ్నుండని
నలుగురు పుత్రుల - నడుమ దశరథుడు
నలువ వలె అల - రారె నప్పుడు

116. రామలక్ష్మణులు - భరత శత్రుఘ్నులు
శుక్లపక్షపు - నుడురాజు వలె
తేజోగరిమను వృద్ధి చెందిరి
పదునొకొండవ - వత్సరంబున
ఉపనయనములు - గావించె నరపతి
సకలాస్త్ర శస్త్ర - వేద విద్యలు
అన్నియును అరసిరి - ఆరితేరిరి
భువన మోహనులు - దశరథ సుతులు

117. ముని వసిష్టుని - రావించుకొని
మంచి ముహూర్తము - నిర్ణయింపుడు
నలుగురు సుతుల - వివాహముజేయ
నిశ్చయించితిని - నా మనమందున
ఈ ధరయందున - గుణవర్ధితులు
కడు సుందరులగు - కన్యామణుల
వివరమ్ముల నిక - స్వీకరించుడని
ముని వసిష్టుని - గోరె దశరథుడు

118. ఆ సమయంబున - ఘనతేజుడగు
గాధి తనయుడు - అట కేతెంచి
నగరు వాకిట - రక్షక భటులతో
విశ్వామిత్రుడు - అరుదెంచెనని
దశరథేశునకు - విన్నవింపుడనె
అది తెలిసిన వశు - ధాధిపు డంతట
గురు వశిష్టుని - తోడ్కొని పోయి
గాధేయునకు - వందనమ్ము లిడె

119. వసిష్టమునితో - కలహించితివి
బ్రిహ్మపదము చే - బట్టితివి

తపోదీక్షను - భంగము జేయగ
రంభను శిలగ-మార్చిన ఘనుడవు

బలికీడు పశువుగ - గొనిపోబడిన
ద్విజసుతుగాచిన - దిట్టవునీవు

ఇందురిని పైనలిగి-త్రిశంకుస్వర్గము
సృష్టించిన ఘన - చరితాత్ముడవీవు

120 కమలసంభవుతో - సరియగువాడవు
తాపసమునిలోక - శశివినీవని

దశరథరాజు - గాధేయునిగని
పరిపరివిధముల - ప్రస్తుతించెను

తనసదనము - నకు ఆహ్వానించి
అర్ఘ్యపాద్యముల - సత్కరించెను

దశరథుడిడిన - పూజలందుకొని
కుశలములడిగి - ఆశీస్సులునిడె

121 ఏకోరికపై - ఇటకువచ్చిరి
సందియమొందక - నాకు దెలిపిన
తమఆనతి శిర - సావహించి నే
ఎంతటి కార్యము - నైన జేతునని
ముకుళితకరుడై - నరపతి పలుక
కార్యార్థిగ నే - నిటకువచ్చితిని
నాకోరిక మన్నిం - తువునీవని
మనమునందు నే-తలచుచుంటిని

18వ సర్గ సంపూర్ణం

19వ సర్గ

విశ్వామిత్రుడు యాగసంరక్షణ కొరకు
రాముని బంపుమని దశరధుని కోరుట

122 నేనొక క్రతువు - జేయుదలంచి
దీక్షబూనితిని - ఎన్నోసారులు
కామరూపులు - కడువంచకులు
తాటకిసుతులు మా - రీచ
సుభాహులు
యాగము భంగము - జేయుటకొరకు
రక్తమాంసములు - జిమ్ముచుంటిరి
రాక్షసకృత్యము -లెన్నొసలుపుచు
ఋషులందర హిం - సించు
చుంటిరి

123 రావణుండను - రాక్షసరాజు
పంపగవచ్చిరి - రాక్షసద్వయము

కినుకవహించి - శపించగలాడను
దీక్షబూనుటచె - బ్రతికిపోతిరి

దనుజులగూల్చి - యాగరక్షణము
గావించెడి వీ - రాధివీరుడు

ఇటమున్నాడని - తెలుసుకొంటిని
సీతాసతిని - గొనిపోదలచితి

124 నీతనయుడు సు - గుణాభిరాముడు
అవక్రపరాక్రమ - విక్రమశాలి

రామచంద్రుడు - తనయుడునీకు
అమరాధిపతి - తుల్యుడునాకు

యాగరక్షణ - గావించుటకై
శ్రీరఘురాముని - నాతోబంపుము

పుత్రప్రేమతో - వెనుకాడకుము
బాస చేసితివి - మరువబోకుము

125 రామచంద్రుని - క్షేమముజూచెద
తపోబలముచే - నేనార్జించిన

విద్యలన్ని శ్రీ - రామునికొసగెద
రక్కసిమూకల మట్టుబెట్టుటకు

ముల్లోకములా - కీర్తిగడించి
నీయశస్సు నలు - దిక్కులచాటును

నీకుశుభములు - సమకూర్చెదదు
దారుణవిపత్తులకు - శాంతినిత్తుదు

126. "శ్రీ రఘురాముడు - బాలుడు నీకు
ధీరుడు మాకు - జగదభి రాముడు
శ్రీరాముడు నా - రాయణ తేజుడు
అతని తేజము - గాంచి నంతనే
దుష్ట రాక్షసులు - బెదరి పారును
రామ బాణము - తిరుగు లేనిది
అసురుల గూల్చుట - కదియె చాలు
బాసచేతు నా - మాటలు నమ్ముము"

127. "కాదని తలచిన - ముని వసిష్టుని
మునికోవిదులను — మంత్రివర్యులను
సంప్రదింపుము - సమ్మతి తోడ
అటు పిమ్మట శ్రీ - రాముని బంపుము
యాగము జేయు - పది దినములును
రాముడు రక్షణ - జేసిన చాలును
అని పలికిన ఆ - గాధేయుని గని
దశరథేశుడు - ఇటుల పలికెను"

(19 వ సర్గ సంపూర్ణం)

# 20వ సర్గ

దశరథుడు రాముని విశ్వామిత్రునితో బంపుటకు నిరాకరించుట

---

128. ముని పలుకులు విని - దశరథు డంతట
శోక సంద్రమున మునిగినవాడై
ఖడ్గ ఖండిత – మహా నగమువలె
వసుధపైన తా - కూలె నప్పుడు
రాముని విడచి - నే మనజాలను
రామచంద్రుడే – సర్వము నాకని
హీన స్వరమున - దశరథ రాజు
గాధేయునకు - విన్నవించెను

129. రాముడు బాలుడు - రాజీవనేత్రుడు
పదహారేండ్లు - నిండనివాడు
యుద్ధ నిపుణత - నెరుగనివాడు
కామరూపులు కడు - వంచకులగు
అసురులతో పో - రాడగ లేడు
అందువలన నే - యాగ రక్షణకు
రామచంద్రుని - పంపగ లేనని
దశరథు డనెను - గాధేయుని గని

130\. తనయులు లేరని - తపన జెందితిని
తనయులు పుట్టగ - సంతసించితిని
తనయుల తోడ - తనివి తీరగా
కాలము గడపెడి - సమయమందున

ఘోర రక్కసుల - తుద ముట్టింపగ
రఘురాముని మీ - వెంట బంపుటకు
కడువేదన నే - పొందుచుంటినని
దశరథు డనెను - గాధేయుని గని

131\. ఓ మునివర్యా — మీ కృపవలన
ఘన బలయుతమగు - సైన్యము గలదు
రాముని మీరు - గొని పోదలచిన
రథ గజ తురగ - పదాతి దళముల

కడు దక్షులగు - దండనాథులతో
ధనుర్ధారినై - వెంట వచ్చెదను
అసుర నాశనము - గావించెదను
మీ యాగమును - నే గాచెదననె

దశరథునిపై విశ్వామిత్రుడలుగుట

132. నరనాథుండు - అటుల పలుకగా
పరిభయ కాలపు - రుద్రుని పోలె
అగ్ని కణములే - కన్నుల రాలగ
నా కోరిక మన్నిం - చెద నంటివి
ఏ కార్యమైన — జేతునంటివి
ఇపుడీ తీరున - మాటను దప్పి
రఘు వంశమునకు - మాట దెస్తివని
దశరథు గాంచి - పలికె బ్రహ్మర్షి

(20 వ సర్గ సంపూర్ణం)

## 21వ సర్గ

విశ్వామిత్రునితో రాముని యాగరక్షణకు బంపమని
వసిష్టుడు దశరథునితో చెప్పుట

---

133. నయనాగ్నులు కురి - పించుచు వహాని
రయమున పోవుట – కుద్యమించగా
కులగురువైన వసి - ష్ట మహాముని
విశ్వామిత్రుని - శాంతుని జేసి
దశరథ రాజా – యోచింపకుమా
రాముని బంపుము - కౌసికుతోడా
మునివరు కోర్కెను - దీర్చెద నంటివి
వెనుకకు బోవుట - ధర్మము కాదు

134. రాజ వంశమున - బుట్టినవాడు
బ్రహ్మర్షిగ తా - నెదిగినవాడు
ఘన తపంబున - శివుని మెప్పించి
అస్త్ర సంతతులు - అందినవాడు
మంత్ర తంత్రముల - మహిమాన్వితుడు
యక్ష కిన్నెర – కింపురుషాదులు
ఎరుగరాని మ - హాస్త్ర సంపద
తన కైవల్యము - జేసికొనినాడు

135. అట్టి ధీరుడు - విశ్వామిత్రుడు
రామచంద్రుని - కంటిపాప వలె
కాచుకొందుడు - క్రతు సమయంబున
మనమున నీవు - శంకను విడచి
శ్రీ రఘురాముని - తేజోమయుని
గాధేయునితో - ఆనందముగా
యాగరక్షణకు - బంపుము నీవని
దశరథుని గని - పలికె వసిష్ఠుడు

136. మను వంశంబున - పుట్టినవాడవు
ఈ జగతిని పే - రొందినవాడవు
ప్రజలందరిని - కన్నబిడ్డలటు
పాలించెడి కడు - ధర్మమూర్తివి
సర్వ ధర్మములు - తెలిసినవాడవు
ధీమంతుడవు – సత్యసంధుడవు
నీవెరుగని ర - హస్యము గలదు
అది చెప్పెదను - ఆలకింపుము

137. రాముని జనన - విశేషము తెలిసి
గాధేయుడు తన - శక్తులన్నియు
రామచంద్రునికి - ఇవ్వదలంచి
యాగరక్షణ - అను నెపమ్మున
రఘురాముని తన - వెంట పంపమనె
అసురు లందరిని — తన కోపాగ్నిచే
క్షణము నందున - భస్మము జేసి
కాలుని పురికి - పంపగలవాడు

(21 వ సర్గ సంపూర్ణం)

## 22 వ సర్గ

దశరథుడు రామలక్ష్మణులను విశ్వామిత్రునితో బంపుట కంగీకరించుట

---

138. గురు వసిష్టుని — మాటలు వినిన
దశరథ రాజు - సూతుని కనుగొని
రామ లక్ష్మణుల - శీఘ్రివె రమ్మని
కబురంపెను కడు - సంతసమ్మున
కంజ దళాక్షుడు — రామచంద్రుడు
లక్ష్మణు తోడా - సభకు జేరగా
ప్రేమతో వారిని - కౌగిలించుకొని
శిరముల మూర్కొని - ముద్దాడుకొని

139. తపోధనుడగు — విశ్వామిత్రుడు
నిను తన వెంట — గొని పోవచ్చెను
నీ అనుజన్ముడు - లక్ష్మణు తోడ
నీవరుగుము ముని - కౌసికు తోడ
యాగరక్షణ గా - వింపుడు మీరు
కౌసికు నానతి - శిరము వహింపుడు
అని దశరథుడు - కడు సంప్రీతిని
గాధేయునకు — అప్పగించెను

140. ముగ్గురమ్మలకు - మ్రొక్కులు ఇడిరి
దశరథేశునకు - ప్రణమిల్లితిరి
వసిష్టాది ముని - ముఖ్యులు మంత్రులు
పురోహితులును - బంధు జనమ్ములు
మంగళకరముగు - దీవెనలిడగా
దేవదుందుభులు - దద్దరిల్లగా
గాధి తనయుని - ఆశీస్సులు గొని
దాశరథీశులు - వెంట నడచిరి

141. ముని కౌశికుడు - ముందు నడువగా
ధనుర్బాణములు - కరముల దాల్చి
అనుజ లక్ష్మణుడు - అనుసరించగా
మణిగణభూషణ - కాంతులన్నియు
దశదిశలా వ్యా - పించు చుండగా
పౌర జనంబులు - జూచుచుండగ
మగువలంత - కుసుమములు జల్లగ
వెడలె నంత - కోదండపాణి

142. సరయూ నదికి - దక్షిణ భాగము
జేరినంతనే - విశ్వామిత్రుడు
ఈ నది నీరము - కడు నిర్మలము
ఆచమనము గా - వించి వచ్చిన
బల అతిబల - మంత్రి విద్యలను
నీ కుపదేశము - గావించెద నేనని
ముని కౌశికుడు - మృదు మధురమ్ముగ
రామచంద్రుని - గాంచి పలికెను

143. రామచంద్రుడు - శుచియై రాగ
బల అతిబల మహా - మంత్రములు
ఉపదేశించెను - రామభద్రునకు
బల అతిబల - మంత్ర రాజములు
నలువ చేత - సృజియింపబడినవి
వానినుండి నా - కొసగ బడినవి
నా తపస్సులు - కొనసాగినవని
విశ్వామిత్రుడు - తెలిపె రామునికి

144. నియమ నిష్ఠలతో - నీవు జపించిన
అకలి దప్పుల - బాధ తొలగును
జరయు రుజయు - నీ దరికి రాతేవు
అనిమిషు లెవరు - ఎదురిడ లేరు
అసుర సంతతి — యమపురి కరుగు
సకల సంపదలు - నీకు కలుగును
ఆయురారోగ్య — కామితార్థములు
అన్ని సమకూరు ఈ - మంత్రపఠనచే

45. పావనమైన — మంత్రపఠనచే
వెలిగె రాముడు - భాను సమానుడై
గురు దేవులకు - వందనము లిడి
తన కార్యములు - ముగియించుకొని
సరయూనది తటి — తీరమందున
పర్ణశయ్యను — అమర్చుకొని
గురు వచనములే - మరిమరి తలచుచు
దశరథ సుతులు - నిదురబోయిరి

(22 వ సర్గ సంపూర్ణం)

## 23 వ సర్గ

### విశ్వామిత్రుడు శ్రీరాముని మేలుకొలుపుట

146. కౌసల్యా తనయ - ఓ శ్రీరామా
ఉదయాద్రిని ఉ - దయభానుడు వచ్చు
వేళాయెనయా – శీఘ్రమె లెమ్ము
కాల కృత్యములు - ఆచరింపుము
అని గాధేయుడు - మేలుకొలుపగా
రామ లక్ష్మణులు - నిదుర మేల్కొని
స్నానాదులను - ముగియించుకొని
విశ్వామిత్రుని - అనుసరించిరి

147. జాహ్నవీ నది - సంగమ స్థానము
సరయూ వాహిని – అంతిమ స్థానము
సురుచిరమైన - వృక్ష సంతతుల
సుశోభితమై - కడు అలరారెడి
ఆశ్రమంబున - తపము జేసెడి
ఋషివర్యులను - గాంచి రాముడు
మనము నందు - కడు మెచ్చినవాడై
ఆశ్రమ విషయము - లడిగె కౌశికుని

148. మును ఫాలాక్షుడు - సతీ సమేతుడై
ఘోరతపము గా - వించె నిచ్చట
సుర గణంబులు - శివుని తపస్సు
భగ్నము జేయు - సంకల్పించి
పుష్పాయుధుని - నియోగించగా
మదనుఁచే త - పో భంగము చెంది
పరమేశుడు తన - ఫాల నేత్రమున
భస్మము జేసెను - మన్మథు నిచట

149. నాటినుండి ఇది - స్థన్వాశ్రమ మని
పేరు గాంచినది - ధరణి యందున
రామలక్ష్మణులు - ముని గాధేయుడు
అరయుట తెలసి - ఆశ్రమవాసులు
అర్ఘ్య పాద్యముల - సత్కరించిరి
కామాశ్రమమున - నాటి రేతిరి
ముని కౌశికుడు - కథలను జెప్పుచు
దశరథ తనయుల - నిదురబుచ్చెను

150. వేకువఝామున – వేద ఘోషలు
విని కౌశికుడు - నిదురలేచెను

మునులు పంపిన - నావ యందున
గంగానదిని - దాటుచుండగా

ఘనమేఘములు ఘ - ర్జించెడు రీతిగ
కడు భీకరమగు - నినదము వినపడె

రాముండడిగె వి - శ్వామిత్రుని గని
ఆ వినిపించెడు - ధ్వని ఏమిటని

151. మును విధాత కై - లాస గిరిపైన
సరోవరము - సృష్టించె నచ్చట

ఆ కాసారము - పొంగి ప్రవహించి
సరయూనది యని - పేరొందినది

అయోధ్య పురిని - అంటి పారుచు
తరంగ ధ్వనులతో - గంగ చేరెనన

రామలక్ష్మణులు - సంగమంబునకు
వందనమ్ములిడి - దాటిరి గంగను

(23 వ సర్గ సంపూర్ణం)

# 24 వ సర్గ

## తాటక వృత్తాంతము

152. విశ్వామిత్రుడు - రామలక్ష్మణులు
గంగను దాటి - సాగుచుండగ
కడు దట్టమగు - భూరుహములతో
వ్యాఘ్ర సింహముల - గర్జనములతో
మత్త గజముల - ఘీంకారములతో
నిర్జన భూమిని - గనిన రాముడు
ఆ ప్రదేశము - నిర్జనమగుటకు
కారణమడిగెను - ముని కౌశికుని

153. ఉగ్రతపము వృ - త్రాసురుడు జేయ
దేవరాజు భీ - తిల్లినవాడై
వృత్రాసురుని - వధించె ఇంద్రుడు
బ్రాహ్మణహత్యా పా - తకమున బడి
తన రూపు చెడి - కృంగి కృశించెను
గంగా స్నానము - చేయుట చేత
బ్రహ్మహత్యా పా - తకము తొలగి
సురనాథుడు నిజ - రూపము పొందెను

154. తన పాపములు - హరియింపగ జేసిన
భాగీరథి తటి - సీమలందున
మదల కరూశ రా - జ్యములు వెలయు
అమరాధిపతి — దీవించెను ప్రీతిగ
సిరి సంపదల - సుఖ శాంతులతో
రెండు రాజ్యములు - వర్ధిల్లె నిట
కాలక్రమమున - రక్కసి తాటక
ఇరు రాజ్యములను - నాశము జేసెను

(24 వ సర్గ సంపూర్ణం)

# 25 వ సర్గ

155. సుకేతుండను - యక్ష ప్రజాపతి
నలువను గూర్చి – తపమొనరించెను

బ్రహ్మ వరమున - కడుసుందరి యగు
తనయను బడసి - తాటక పేరిడె

సుందున కొసగి - పెండ్లి జేసెను
ఆ దంపతులకు - మారీచు డను

దుష్టాచారుడు – కడు నీచాత్ముడు
మహా బలుడగు - సుతుడు కలిగెను

156. ముని అగస్త్యుని - శాపము చేత
సుందుడు మడసి - యమపురి కేగెను

కోపముచెంది మా - రీచ తాటకులు
పగగొని అగస్త్యుపై - దాడి చేసెను

అసురులు కమ్మని - ముని శపించగా
భీకరమగు ఆ - కారము దాల్చి

నరుల భుజించుచు - మదల కరూశ
దేశములను ని - ర్జనము జేసెను

157. రక్కసి తాటక - అబల కాదది
వేయి ఏనుగుల - బలము కల్గినది
ఈ ప్రదేశమున - కడు యథేచ్ఛగా
వీర విహారము - జేయుచున్నది
కంటబడినచో - సంహరింపుము
స్త్రీని వధించుట - పాపమనెంచకు
నీవు తప్ప ఈ - అసుర తాటకను
చంపువాడు ఈ - ధరణిన లేడు

158. దురితుల దునిమి — సాధు జనులను
రక్షించుట నర - పతుల ధర్మము
కావున రామా - క్రూర తాటకను
పంపుము నీవు కృ - తాంతు సీమకు
రాజధర్మము - విస్మరింపకుము
లోకమునకు - కళ్యాణ మొసగుము
అని గాధేయుడు - రఘురామునకు
తాటక వధకు - బీజము నాటెను

(25 వ సర్గ సంపూర్ణం)

# 26వ సర్గ

## రాముడు తాటక సంహారము జేయుట

159. మీ ఆనతి శిర - సావహింపుమను
జనకుని ఆజ్ఞను - నే పాలించెద
గో ద్విజాళికి - శుభములు గూర్చగ
దుష్టచారిణి - ఘోరపాపి యగు
రక్కసి తాటక - తుద ముట్టించెద
మీకు ముదము - ఒనగూర్చెద నేనని
శ్రీ రఘురాముడు - నారి సారించ
గహన భూములు - ఘోషిల్లినవి

160. అడవియందు పెను - ధ్వనులను వినిన
రక్కసి తాటక - దిగ్భ్రాంతిని జెంది
మనమునందు కడు - భీతిల్లినదై
దశ దిశలన్నియు - పిక్కటిల్లగా
గర్జన జేయుచు - ధరణిని దట్టగ
ధరణి వణికి పెను - ధూళి చెలరేగె
ఆ రవంబులు - వినగ వచ్చెడి
దిశకు పరుగులిడె - సుడిగాలి వలె

161. అటు లేతెంచెడి - తాటకను గని
కనుమో లక్ష్మణ - వికట రూపిణి
ఈ తాటక ఒక - మగువ గావున
జంపకూడదను- భావము వొందలెను
దీని నాసికను - కర్ణ యుగ్మమును
క్షణమున ద్రుంచి - జవసత్వమ్ములు
తరుగునట్లుగా - నే జేసెదనని
శరము సంధించు - సమయమందునా

162. వికృత రూపిణి - నిశా విహారిణి
మంత్ర తంత్రముల - మాయలెరిగిన
దుష్ట రక్కసి - దుమారము లేపి
రాళ్ళవాన కురి - పించె తాటక
కొండంతగ తా - నెదిగి పోయెను
కారుమబ్బు వలె - క్రమ్మర వచ్చెను
అది గాంచిన ఆ - కౌశికు డంతట
రాముని తోడ - ఇటుల పలికెను

163. అసుర వనితను - అంతము జేయుట
తగదని మనమున - ఆలోచింపకు
సంధ్యా సమయము - దాటినంతనే
అసురుల బలము - రెట్టింపగును
తాటక నపుడు - ద్రుంచుట కష్టము
సంధ్యా సమయము - రాకుండగనే
అంతము జేయుము - అసుర వనితనని
తన ఆనతిగా - నుడివె రామునకు

164. గురునానతిని - శిరమున దాలిచి
మనమునందు సం - శయము విడనాడి
రాముడంతట - ఉగ్రరూపుడై
శర సంధానము - జేసి విడచెను
రాముడు విడచిన - సునిశిత శరము
క్రూర తాటక — హృదయము జీల్చెను
రక్కసి అరచుచు - ధరణిని గూలి
అసువులు బాసి - యమపురి కరిగెను

165. తాటకవధ గా - వించినంతనే
సురలు ఋషులు - కడు మోదమొందిరి

లోక రక్షణకు - దైత్యుల వధకు
భూవలయంబున - పుట్టె రాముడు

ఈతడె నీకు — సరియగు శిష్యుడు
నీవెరిగిన శ - స్త్రాస్త్ర విద్యలను

రఘురామునకు - విశదపరచుమని
అమరనాథుడు - అరిగె నాకము

(26 వ సర్గ సంపూర్ణం)

## 27, 28 వ సర్గలు

166. తాటక వధను - గాంచి మునివరుడు
ముదమారగ శ్రీ - రామచంద్రుని

కౌగిట జేర్చి - శిరము ముద్దిడి
తాటక దునిమి - భువిని ధర్మము

నిలిపితి వీవు — ఓ రఘునందన
నేటికి నీవిక — విశ్రమింపుము

రేపటి దినమున — పయనమగుదము
మన ఆశ్రమము - జేరుటకనియె

167. రామలక్ష్మణు - విశ్వామిత్రులు
నాటిరేయి సుఖ - నిద్ర గడపిరి

వేకువ రూమున - నిదుర లేచిరి
తాటక లేని - ఆ వనభూమి

హాయిగ తోచెను - చైత్రరథము వలె
మధుర వాక్స్వరణి - రాముని గాంచి

తగినవాడవని - మనమందున ఎంచితి
దివ్యాస్త్రములు - నీకొసగెదననె

## విశ్వామిత్రుడు దివ్యాస్త్రములను రామునికొసగుట

168. గరుడ గంధర్వ - కింపురుషాదుల
యక్ష నిశాచర - సిద్ధసాధ్యుల
అమరుల నాగుల - మహిమోపేతుల
కయ్యము నందు - ఎదిరి జయించె
అస్త్ర శస్త్రముల - సర్వ విద్యలను
లోక రక్షణకు - నేనొసగెదనని
మంత్రి రాజములు - పఠనము జేయుచు
రాముని కరముల - ధారబోసెను

169. దండ చక్రమును - ధర్మ చక్రమును
కాల చక్రమును - విష్ణు చక్రమును
బ్రహ్మాస్త్రమును - ఇంద్రాస్త్రమును
ఐషికాస్త్రమును - వజ్రాస్త్రమును
వరుణాస్త్రమును - వరుణపాశమును
ధర్మపాశమును - కాలపాశమును
మొదలుగా గల - సకలాస్త్రములను
రామునకొసగెను - విశ్వామిత్రుడు

170. ఆగ్నేయాస్త్రము - వాయువ్యాస్త్రము
నారాయణపై - నాకాస్త్రమును
బ్రహ్మ శిరాస్త్రము - శివశూలమును
క్రౌంచాస్త్రమును - హయశిరాస్త్రమును
ఆర్ద్రాశనిని - శుష్కాశనిని
మోదకి శిఖరి - గదాద్వయమును
మొదలుగా గల - దివ్యాస్త్ర సంపద
రాముని కొసగెను - ఆ గాధేయుడు

171. నందకమ్మను - మహా ఖడ్గమును
వైద్యాధరమను - దివ్యాస్త్రమును
దినకరాస్త్రమును - సోమాస్త్రమును
గాంధర్వంబను - మహాస్త్రమ్మును
కాపాళ ముసల - కంకణమ్ములను
మానవ ప్రశమన - ప్రస్వాపనలను
ఆదిగా గల - సర్వాస్త్రములను
ముని కౌశికుడు - రామున కొసగెను

172. అస్త్ర ప్రయోగ - మంత్రములన్నియు
ఉపసంహారము - జేయు మంత్రములు
విశ్వామిత్రుడు - రామున కొసగెను
మనసు మీరగా — ఆనందించెను
రామలక్ష్మణులు - గురువుతో సాగిరి
ఘోరారణ్యము - దాటి నడచిరి
మార్గమధ్యమున - ఆశ్రమంబు గని
దాని విశేషము - అడిగె రాముడు

(27, 28 సర్గలు సంపూర్ణం)

# 29 వ సర్గ

శ్రీ మహావిష్ణువు వామనావతారమును దాల్చుట

173. మును లక్ష్మీశుడు - యోగసిద్ధికై
వేనకు వేల - వత్సరంబులు
నియమ నిష్ఠలతో - ఘోర తపస్సు
ఆచరించిన - పుణ్యస్థలమిది
వామనరూపున - నారాయణుడు
వాసము జేసిన - పుణ్యాశ్రమమిది
ముని కశ్యపుడు - సిద్ధిని బొందిన
అతి పవిత్రమగు - పుణ్యవాటికిది

174. ప్రహ్లాదుని కు - మారుని కొమరుడు
బలి చక్రవర్తి - పేరిటివాడు
త్రిలోకములు జ - యించిన పిమ్మట
మహాయాగము - ప్రారంభించెను
వాని యాగము - ముగియక మును పే
ఆ యాగమును - భంగ మొనర్చి
సురల గావుమని - దేవేంద్రాదులు
సిద్ధాశ్రమమున - విష్ణుని గోరిరి

175. ఆ సమయంబున - ముని కశ్యపుడు
ఉగ్రతపంబును - జేసె విష్ణుకై
శ్రీహరి మెచ్చి - ప్రత్యక్షమాయెను
సకల చరాచర - జగతి యంతయు

నీ తనువందున - గోచరించును
ఆది మధ్యాంత - రహితుడ వీవు
నీ చరణములే - నాకు శరణమని
కడు స్తుతియించెను - కశ్యపుడంతట

176. కశ్యప మునివర — నీ తపంబునకు
సంతసించి నే - వచ్చితి నిటకు
మనమునందున - ఏ కోరికపై
తపము చేసితివో - తెలియబరచుమన

కశ్యపుడంతట - కరములు మోడ్చి
నీ వరమునకు - అర్హుడనేని
మా దంపతులకు - నీవు తనయునిగ
జనియించుము - ఈ ధరణియందున

177. కశ్యపు వరము - దీర్చ నెపమ్మున
అదితి గర్భమున - కుబ్జాకృతి గొని
వారికి జనించె - వామనమూర్తిగ
అడిగినవారికి — లేదనకుండా
దానములొసగెడు - బలికడ కేగి
అసుర నాయకా — నిను యాచించెద
మూడడుగుల నేల - దానమిమ్మని
అతి మధురముగా - వామనుడడిగె

178. వక్షము నందున - సిరిని నిల్పెడి
విష్ణుదేవుడే - సిగ్గును విడచి
తనను యాచింప - వచ్చుటను గని
వామను డడిగిన - మూడడుగుల నేల
ధారపోసెను - సంతసమ్మున
వామను డంతట - భువనములన్నియు
ఆక్రమించె రెం - డడుగుల తోడ
మూడవ అడుగున - బలిని బంధించె

179. వామనుడుండిన - సిద్ధాశ్రమమిది
నేనిప్పుడిందు వ - సింపుచుంటిని
సిద్ధిని బొందగ - దీక్ష వహించి
జన్నము చేయుగ - నే దలచితిని

అని కౌశికుడు - దాశరథులతో
సిద్ధాశ్రమమున - ప్రవేశించగా
గాధి తనయుని - రామలక్ష్మణుల
ఆశ్రమవాసులు - సత్కరించిరి

(29 వ సర్గ సంపూర్ణం)

## 30వ సర్గ

రామలక్ష్మణులు యాగముగాచి
మారీచ సుభాహులను సంహరించుట

---

180. దీక్షగొనిన గా - ధేయుని కనుగొని
కడు వినయముగా - రాముడడిగెను
నిశాచరులు మా - రీచ సుభాహులు
ఏ సమయమ్మున - ఇటకు వత్తురన
ఆ మాటలు విని - విశ్వామిత్రుడు
ఈ దినము మొదలు - ఆరు రాత్రులు
మీరిరువురును - సవనము గాచి
దుష్టదానవుల - తుది ముట్టింపుడు

181. వేదోక్తముగా - కౌశికు యాగము
ఆరంభించిరి — శుభ ముహూర్తాన
కోదండములు — కేల నిడుకొని
యాగ విదులను - గాచిరి వారు
ఆరవ దినమున — ప్రళయ ఘోషతో
గగనమంత మే - ఘా వృతమాయెను
పటు భీకరగతి - శిలావర్షమును
కురిపించిరి మా - రీచ సుభాహులు

182. రామలక్ష్మణులు – నిశి శరంబుల
శిలా వర్షమును – అపిరంతటట

అటుపిమ్మట మా - రీచ సుబాహులు
కడు దారుణమగు - రుధిర వర్షమును

కురిపించిరి ఆ - యజ్ఞ వేదికను
రామచంద్రుడు - మానవాస్త్రమును

మారీచునిపై – ప్రయోగించగా
సాగరమందున – మారీచుడు పడె

183. అంత సుబాహుడు - కడు రెచ్చుచును
రామలక్ష్మణుల – కొరకొర చూచుచు

అసుర గణముతో - మీదికి రాగ
రాముడంతట - ఆగ్నేయాస్త్రము

నారి సంధించి - గ్రక్కున విడువగ
గుండె పగిలి ఆ - సుబాహుడంతట

పక్షములు తెగిన - మహానగమువలె
గిలగిలలాడుచు - అసువులు బాసెను

184. క్రతుభంగము గా - వించెడి దనుజుల
యమపురి కంపిన - రాముని గాంచి
ముని కౌశికుడా - నందము పొందెను
ఋత్విజులందరు - దీవెనలిడుచు
గురు కార్యమును - దీక్ష వహించి
యాగ భారమును — పూర్తి జేసితివి
ఈ ఆశ్రమమునకు - సిద్ధాశ్రమమని
నామము నీవల - సార్థకమాయెను

30 వ సర్గ సంపూర్ణం)

# 31వ సర్గ

## విశ్వామిత్రునితో రామలక్ష్మణులు మిథిలకేగుట

185 గురు కౌశికుని - పాదమ్ములకు
రామలక్ష్మణులు - వందనములిడి
ఓ గురువర్యా - మీ అనతిని
మేమిరువురము - శిరము దాల్తుము
మిగిలిన కార్యము - శలవిచ్చినచో
మిమ్ము సంతుష్టుల - గావింతుమన
ఆ పలుకులు విని - మునిగణమంతట
గాధేయునితో - ఇటుల పలికిరి

186. ఈ ధరయందున - కడు ధార్మికుడు
మిథిలానాథుడు - కడు సజ్జనుడు
జనకుని ఇంట - సురశైలము వలె
పరమేశ్వరుని - చాపమున్నది
దేవరాతుడను - మిథిలాధిపతి
పూర్వము జేసెను - మహాయాగము
అనిమిషులందరు - ఆనందించి
యాగఫలముగా - శివధను వొసగిరి

187. నాటినుండి ఈ - నాటివరకది
నిత్యపూజల - నలరుచున్నది
జనక మహీపతి - తన సుత సీతకు
స్వయంవరము ప్ర - కటించెనిప్పుడు
శివ చాపమును - ఎక్కు పెట్టగల
ధీమంతునకు - తన సుతనిచ్చి
పరిణయము జేయ - సంకల్పించి
వార్తనంపె దే - శాధిపతులకు

188. మహిమాన్వితమగు - శివుని చాపమ్మును
ఎక్కుపెట్టగల - ధీరులు లేరు
సురగరుడోరగ - విద్యాధరులు
యక్ష కిన్నెర - కింపురుషాదులు
పరమేశుని ఆ - మహా చాపమ్మును
ఎక్కుబెట్టగా — యతనము జేసి
పరిహాసముల - పాలుబడినారు
అని నుడివిరి ముని - వర్యులంతట

189. స్వయంవరమును - తనుజ పండువగ
గాంచగ వేము - ఏగుచుంటిమి

మీరుగూడ మీ - శిష్యుల తోడ
మిథిలా నగరికి - రమ్మని పిలచిరి

వన దేవతలకు - వందనములిడి
ఆశ్రమమునకు ప్ర - దక్షిణలు సలిపి

రామలక్ష్మణుల - వెంట నిడుకొని
మిథిలానగరికి - పయనమాయెను

190. విశ్వామిత్రుడు - ఏగు సమయాన
వనమునందు గల - మృగ విహంగాది

గణములన్ని ముని - వెంట నడువగా
ప్రేమ మీరగా - వాటిని తాకి

మరలి పొమ్మని - ముని వారించె
ఆశ్రమమందలి - అగ్ని హోత్రమును

పరికరములను - మునులు గైకొన
దాశరథులతో - కదలె కౌశికుడు

191. అంబుజ నేత్రుడు - అస్త శైలమున
గ్రుంకు సమయాన - చేరిరంతట
శోణనదీ తటి - తీరంబులను
పికములంతట - కిచకిచలాడుచు
గూడులు చేరగ - పయనమాయెను
వన్య మృగములు - వేటకు వెడలెను
చంద్రుడు మెల్లగ - తొంగి చూచెను
యక్ష రాక్షసులు - సంచరించెను

192. రామలక్ష్మణులు — శోణ నదియందు
స్నాన సంధ్యాదులు - జేసిరంతట
తేజోమయుడగు - కౌశికు గాంచి
భక్తి మీరగా - వందనములిడి
కనులకు ఎంతో — విందు జేయుచు
కడుసుందరమై — అలరారెడి ఈ
పావనభూమి - ఎవ్వరిదోనని
రాముడడిగె వి - శ్వామిత్రుని గని

(31 వ సర్గ సంపూర్ణం)

# 32, 33, 34 వ సర్గలు

## విశ్వామిత్రుడు రామునకు తన వంశక్రమము దెల్పుట

193. నా వంశమునకు – మూలపురుషుడు
కుశుడనువాడు – నలువ కుమారుడు
కడు ధార్మికుడు - కడు హితకరుడు
వినుతి గాంచెను - చతుర్ముఖునివలె
విదర్భ దేశపు – రాకుమారిని
పరిణయమాడెను – సంతసంబున
ధర్మజ్ఞులును - నీతిమంతులగు
నలుగురు సుతులను - కనె కుశుని సతి

194. ప్రథమ తనయునకు - కుశనాభుడని
ద్వితీయ సుతునకు - కుశాంబుడనియు
తృతీయ సుతునకు - వసువు అనియు
చతుర్థ సుతునకు - ధూర్తజుడనియు
నామకరణములు – జేసి మురిసెను
శుక్లపక్షపు – చంద్రుని వోలె
నలుగురు సుతులు - ఎదిగిన వెంటనె
వారిని గాంచి – కుశుడిటులనెను

195. ధరణి యంతయు - నాల్గు భాగములు
విభజించి ఇక - పాలింపుడనె

తండ్రి యానతిని - శిరమున దాల్చి
కుశనాభుడు, కు - శాంబి నగరమును

కుశాంబుడు మ - హోదయ పురమును
ధూర్తజుడు ధర్మా - రణ్య పురమును

గిరివ్రజ పురమును - వసువు నిర్మించి
ధర్మగతిని పరి - పాలన జేసిరి

96 కుశనాభుండు ఘృ - తాచిని పెండ్లాడి
సద్గుణవంతులు - రూపవతులగు

నూర్వురు సుతలకు - జనన మిచ్చెను
యౌవనవతులగు - రాజకన్యలు

మృదులాంబరములు - ఇంపుగ దాల్చి
వీణియలను తమ - కరముల దాల్చి

గానముజేయుచు - నృత్యముజేయుచు
ఉద్యానమున - విహరించగ జనె

197. మోహనాంగులను - గనిన అనలుడు
మన్మథవసుడై - ఇటుల పలికెను

యాపలావణ్య - యువతుల్లారా
నే పవనుడ - సురలోకవాసుడ

పరిణయమాడగ - వచ్చితి నేను
నరులయందు య-వ్వనము చంచలము

నను పెనిమిటిగా — స్వీకరించిన
నరరూపు బాసి సు - రత్వము పొందుడి

198 ఆ పలుకులకు - లలన లిటులనె
జగతియందు గల - సర్వభూతములల

ఎల్లవేళలా - రక్షణ జేసెడి
మహాబలుడవు - ధర్మమూర్తివి

సత్యవాది సు - విశాల మనస్కుడు
కుశనాభునికి - సుతలము మేము

నియమము వీడి - అవమానించుట
నీకు పాడియా - ఓ ప్రభంజనా

199. మా జనకుని చు - లకనగ దలచకు
అతడే మాకు — దైవము గురువు

అతడు దెచ్చిన - ఏ వరుడైనా
నిశ్చయుంబుగా - పెండ్లి యాడెదము

తపోబలముచే - నిను శపించెడి
శక్తి యున్నది - మాకందరకు

కోపమొందక - నిను వీడితిమి
చనుమిక నీవు - వచ్చిన దారినె

200. ఆ పలుకులు విని - క్రోధించి పవనుడు
పటుతరమైన - ప్రభంజనలచే

కన్యలందరను - కుబ్జుల జేసె
తనువులు అలసట - జెందిన కన్యలు

జలజల రాలెడి - అశ్రు నయనాల
జనకుని పదములు - భయమున బట్టి

జరిగినదంతయు - కడు వివరముగా
విశదపరచిరి - కుశనాథునకు

201. బహు యజ్ఞమ్ముల - పుణ్యఫలము ఆ
క్షమాగుణమునకు - సరికావనియు
అన్ని గుణములా - క్షమాగుణ మొకటె
విశ్వమందు చిర - కీర్తికి మూలము
అట్టి క్షమను మీ - రందరు జూపి
నా వంశమునకు - వన్నె తెచ్చిరని
కుశనాభుండు - కుమార్తెలను గని
వగవగ వలదని - పలికె మృదువుగా

బ్రహ్మదత్తుని చరిత్ర

202. ముని పుంగవుడు - చూళి యనువాడు
ఘోరతపంబును - జేయుట గాంచి
సోమద యనెడి - పేరును బడసిన
ఊర్మిళ తనయ - అచ్చర కన్య
మునివరునెంతో - శ్రద్ధగ కొలిచెను
కొంతకాలమటు - గడచిన పిమ్మట
చూళి మునీంద్రుడు - తృప్తిని బొంది
కోరిక తెలుపగ - కోరె సోమదను

203. భూరి తపోధన - చూళీ మునివర
నాకు భాగ్య మీ - నాటికి కలిగెను

బ్రహ్మచర్యమే - వ్రతముగా గొని
నీకు సపర్యలు - జేసితి స్వామి

బ్రహ్మ జ్ఞానా - వేశుద వీవు
బ్రహ్మ విద్యా - భాసురుండవు

తపో మహిమచే - అనిందాత్ముడగు
తనయు నీయుగా - వేడుచుంటిననె

204. అట్టుల వేడిన - సోమదను గని
మునివరుడెంతో - సంతసమంది

తపో మహిమచే - సంకల్పించి
గుణశాలియగు - కుమారు నొసగెను

బ్రహ్మదత్తునిగ - పేరిడె సోమద
వజ్రాయుధుడు - అమరావతిని

ఏలెడు రీతిని - బ్రహ్మదత్తుడు
కాంపిల్యా పురి - ఏలె ప్రతిభతో

205. అటులలరారెడి – బ్రహ్మదత్తుని
కుశనాభుండు – తన తనయులను

పరిణయమాడగ – కోరినంతనే
కడు ముదంబున – బ్రహ్మదత్తుడు

వారందరినీ – పరిణయమాడగ
కుబ్జరూపములు – బాసి మగువలు

తొల్లిటి రూపున – ప్రకాశించిరి
పెనిమిటి జేరి - పరవశించిరి

206. పరిణయమాడిన - తన సుతలందరు
పెనిమిటి వెనుకే - వెడలిన పిమ్మట

పున్నామ నరకము - పోగొట్టుటకై
పుత్రుని కోరకు - కుశనాభుండు

యాగమొకటి - నిర్వర్తించగనే
తన పిత కుశుడు - అట ప్రత్యక్షమై

నీతో సరియగు - పుత్రుడు కలుగును
గాధియను పేర - వరలున నాతడనె

207. జనకుడిడిన దీ - వెనల ఫలితముగ
కుశనాభునకు - జనించె సుశీలుడు
గాధిరాజుగా - పేరు బడసెను
గాధిరాజుకు - నే జనియించితి
కుశవంశంబున - నే బుట్టుటచే
కౌశికుడని న - న్నందరు పిలుతురు
అని మునీంద్రుడు - రామచంద్రునికి
తన వృత్తాంతము - తెల్పె ముదమున

గంగాదేవి చరిత్ర

208. మేరు గిరీంద్రుని - సుత మనోరమను
పరిణయమాడెను — హిమవంతుడు
వారికి కలిగె - కుమార్తెలిద్దరు
గంగ యమునలని - పేరున పెరిగిరి
యశోవంతులై - అలరారితిరి
అమరులంత హిమ - వంతుని జేరి
పావని గంగను - తమకర్పింపగ
పరిపరి విధముల - ప్రార్థన జేసిరి

209. దేవకార్యమును - దీర్చ నెపమ్మున
గంగనొసగె హిమ - వంతుడు ముదమున

గంగను గైకొని - నాకలోకము
ఏగిరి సురలు - కడు సంతసమున

నదీమ తల్లిగ - రూపము దాల్చి
నాకలోకమున — సురలందరనూ

ఎల్లవేళలా - బ్రోచుచుండెను
హిమవంతుని - సుత గంగామాత

210. ఫాలనేత్రుని - శూలాధరుని
పరమశివుని — తన పతిగాయెంచి

హిమగిరి తనయ - ఉమాదేవి అట
ఉగ్రతపంబును - ఆచరించగా

హిమవంతుడు తన - సుత అభీష్టమును
నెరవేర్చగ మన - మందున దలచి

ప్రమదము మీరగ - శివ పార్వతులకు
పాణిగ్రహణము — జేసెనప్పుడు

211\. అటుపిమ్మట ఆ – నీలకంఠుడు
ఉమాసతి గూడి – కడు శతాబ్దములు
రతికేళిలో – తేలియాడగ
దేవతలందరు – భీతి జెందిరి

శివుడీగతిని – రతిని సలుపగా
శివతేజమ్ము – భరించెడి శక్తి
జవసత్వమ్ములు – ఎవరికున్నవని
తహతహలాడిరి – సురలందఱును

212\. సుర సముదాయము – శూలిని జేరి
పరమ దయానిధి – శశిఖండధరా
నిగమాంతవేద్య – భువనవంద్యా
నీదు తేజము – భరించెడి శక్తి

సుర సంఘంబుల – ఎవరికి లేదు
కావున నీవు – సంగమము వీడి
లోకములను కా – పాడవలెనని
అమరులంతట – కడు అర్థించిరి

213. అటుల వేడెడి - సురలను గాంచి
జగన్మంగళము - ఒనగూర్చగ నే
నా తేజమును - ఎందు విడువవలె
అని అడిగిన ఆ - శూలాయుధు గని

శంభు వీర్యము — దాల్చెడి శక్తి
ధాత్రికి కలదని - తెలిపినంతనే
తన తేజమును - ధరణిని పడగ
శివుడు విడచెను - సంతసంబున

పార్వతి దేవతలను శపించుట

214. పుడమిని జేరిన - శివుని తేజము
భూతలమంతయు - ఆక్రమించెను
దేవగణంబులు - భయభ్రాంతులై
అనలుని జేరి - ప్రార్థన జేసిరి

పవనుని సాయము - అనిలుడు గైకొని
శివతేజమున - ప్రవేశించగా
శివతేజమ్ము శ్వే - త నగమాయె
ఆ పావన పర్వత - ప్రాంతంబదియే

215. కార్తికేయుని - జన్మస్థలమిది
సూర్యాగ్నుల స - మాన తేజమున
ఆ శరవణుడు - ప్రకాశించెను
సురలొనరించిన - అపకారమునకు
ఉమాదేవి కడు - కోపము జెంది
తనయుని గోరి - పతిని జేరెడి
సమయమందున - సుర సంఘంబులు
విఘ్నము జేసిరి - నా కోరిక గని

216. ఓ సురలారా - మీ సతులందరు
సంతతి లేక - కడు దుఃఖింతురు
ఓ పుడమీ నువ్వు - బహురాజుల సతివై
సంతతి లేక - పరితపింతువని
గిరివర కన్య - శపించెనప్పుడని
ముని కౌశికుడు - పార్వతీదేవి
చరితమంతయు - రామచంద్రునికి
విన్నవించెను - మోదము గూర్పగ

(36 వ సర్గ సంపూర్ణం)

# 37వ సర్గ

## కార్తికేయుని చరిత్ర

217. దివిజ బృందములు - నలువను జేరి
అతి వినయముగా - వందనములిడి
దైత్యులు జేసెడి - ఘోర కృత్యములు
సురలందరకు - కంటకమాయెను
దైత్యులందరను - దండించగల
సైనిక నాయకుని - మాకొసంగుమని
మరిమరి వేడిన - అనిమిషుల గని
బ్రహ్మదేవుడు - ఈ విధి పలికెను

218. గిరివర పుత్రి - శాప మమోఘము
కావున మీరు - తనయుల బడయరు
ఫాలలోచనుని - పవిత్ర తేజము
అనలునియందు - భాసిలుచుండెను
హిమవంతుని గా - రాల పట్టియగు
ఉమాదేవికి - చెందెడు తేజము
తో బుట్టువగు - గంగారమణి
దాల్చగ వచ్చును - భేదమరయక

219. కావున మీరు - రయమున నేగి
అగ్నిదేవుని - ప్రార్థించినచో

మీ కోరిక సఫ - లీ కృతమగునని
బ్రహ్మదేవుడు - పలికినంతనే

దేవతలందరు — రజతాచలమున
ఘనతర తేజుని - పావకుని గని

శైవమయినట్టి - భూరి తేజమును
దేవ హితార్థము - గంగ కొసగుమనె

220. అంత పావకుడు - గంగను జేరి
శివతేజము నా - యందు అమరెనని

దానిని గొని - గర్భంబున దాల్చిన
దివ్యతేజుడు కు - మారుడు కలుగును

అని పలికిన ఆ — అగ్నిదేవు గని
వనితారూపము - దాల్చెను గంగ

వైశ్వానరుడు - మోహన రూపియై
గంగయందు శివ - తేజము వదలెను

221. శివతేజము గ - ర్భమున దాల్చిన
గంగ దేహమున - మంటలు రేగెను

ఓ దేవముఖా - శంభుని తేజము
దాల్చగ లేనని - దీన వదనయై

గంగ యపుడు - అనలునికి జెప్పగ
ఘన హిమశైల - పాదమందున

హేమ రజతోజ్వల - శోభల వెలెడి
గర్భము విడువగ - అనలుడు దెల్పెను

222. శివతేజము హి - మశైల పాదమున
గంగ విడువగా - గిరి భాగములు

హేమాన్వితమై - తేజరిల్లెను
శరవణమందు - గంగ యొనర్చిన

గర్భస్రావమున - కొమరుడు గల్గెను
గర్భస్రావమున - జనియించుటచే

స్కందుడను పేర - ప్రసిద్ధుడాయెను
ముల్లోకములా - పూజితుడాయెను

223. సురలంతటట కృ - త్తికల కోరెను
స్తన్యములీయు - ఆ కుమారునకు
ఆర్గురు కృత్తికల - స్తన్యములు గ్రోల
షణ్ముఖు డను పేర - వరలె నాతడు
కృత్తిక లతనిని - పెంచుట చేత
కార్తికేయుడని - పేరును బడసెను
సురలందరు కు - మార స్వామిని
తమ సేనానిగ - స్వీకరించిరి

224. ఈ తీరున గంగ - స్వర్గలోకమున
దేవకార్యము సం - ప్రీతిగ జేసె
గంగా చరితము - షణ్ముఖు జననము
పుడమిని జనులు - భక్తితో వినిన
పుత్రి పౌత్రాభి - వృద్ధి కలుగునని
శరవణభవుడు - కార్తికేయుడు
సుర సేనాపతి - చల్లనిస్వామి
అని రామునితో - పలికె కౌశికుడు

(37 వ సర్గ సంపూర్ణం)

# 38 వ సర్గ

## సగరుని చరిత్ర

225. పూర్వమయోధ్యను - ఏలిన నృపులలో
ధర్మము తప్పక - పాలన జేసి
సురుచిర కీర్తిని - పొందినవాడు
సగరాఖ్యుడనే - పేరిటివాడు
విదర్భదేశపు – రాకుమారియగు
కౌశిని తాను - పరిణయమాడి
సంతతి లేమిచె - రెండవ భార్యగ
సాధ్వి సుమతిని - పెండ్లియాడెను

226. అటుపిమ్మట ఆ - సగరుండంతట
ఇరువురు సతులతొ - కడు సౌఖ్యముగా
భూతలమంతయు - ఏలె మోదముతొ
తనయులు లేరను - చింతను బొంది
తపము జేయ - తన తారల గూడి
ప్రస్రవణాద్రిని - జేరి సగరుడు
శత వర్షములు - తపము జేయుగా
భృగు మహాముని - దర్శనమిచ్చెను

227. మీ తపంబునకు - నే మెచ్చితిని
నే వరమీయగ - సంకల్పించితి

అరువది వేల - సుతులొక భార్యకు
వేరొక సతికి - ఒకే కుమారుడు

మీ ఇర్వుర కే - దేది యిష్టమో
తెలియజేయుడని - మహర్షి అడుగగ

కౌశిని కోరెను - ఒక్క తనయుని
సుమతి వేడె సుతు - లరువది వేవుర

228. వారికి వరములు - ఒసగిన పిమ్మట
భృగు మహాముని - మాయమాయెను

సగరుని సతులు - గర్భము దాల్చిరి
కౌశిని కనెను - ఒక్క కుమారుని

అసమంజనుడని - వరలె నాతడు
సుమతికి వాసిగ - బుట్టె తుంబము

ఆ తుంబమటు - విరిచినంతనే
ఉద్భవించె సుతు - లరువది వేవురు

229. సమస్త జనులను - కడు పీడించుచుచు
కడు దుష్టునిగా — దురభ్యాసునిగ
విచ్చల విడిగా - సంచరించెడి
అసమంజనుని - పృథ్వీనాథుడు
రాజభ్రష్టునిగ - జేసె నాతని
అసమంజునికి - కలిగెను సుతుడు
తేజోమయుడు - గుణగణశీలుడు
అంశుమంతుడని - వరలె నాతడు

(38 వ సర్గ సంపూర్ణం)

## 39, 40 వ సర్గలు

సగరుడశ్వమేధ యాగమును జేయుట

230. వింధ్య హిమాచల - మధ్య భాగమున
అశ్వమేధమను – క్రతువును జేయ
సగరు డంతట - నిశ్చయించెను
మంగళప్రదమగు - సుముహూర్తమున
యువనాశ్వమును - విడచె సగరుడు
మహావీరుడగు - అంశుమంతుని
అశ్వరక్షణకు - వెంట వెడలుమని
సగరుడు కోరెను - ముదము మీరగ

231. దేశ దేశముల – తిరిగిన హయము
యజ్ఞ వేదికకు – మరలి వచ్చెను
దనుజాకృతిని - ఇంద్రుడు గైకొని
యజ్ఞాశ్వమును - అపహరించి జని
నాగ లోకమున – కపిలాశ్రమమున
వదలి అరిగె తా - నాకలోకము
ఋత్విజులంత - సగరుని గాంచి
యువనాశ్వమును - గొని తెమ్మనిరి

232. అరువది వేల – తన కుమారులకు
సగరు డంతట – అజ్ఞను ఇడెను
సగరులంత యు - జ్ఞాశ్వము కనుగొన
భూతలమంతయు - వెదుకసాగిరి
అశ్వము జాడ - అరయకుంటచే
భూమి త్రివ్వి పా - తాళము జేరిరి
వారికెదురైన - సర్వ ప్రాణులను
కడతేర్చుచు తా - ముందుకు సాగిరి

233. తూర్పుదిశను వా - రంతట గనిరి
విరూపాక్ష యును – దిగ్గజంబును
యామ్యదిశను - వారంతట గాంచిరి
మహాపద్మమును - భూగజంబును
పశ్చిమంబున - సౌమనమనెడి
గజపతికెక్కిన - కరిని గాంచిరి
ఉత్తరంబున - భద్రాఖ్యా యును
శీతాచల శృం - గంబును బోలెడి
మహా దిగ్గజము – గాంచిరి సగరులు
భక్తిమీరగా – గజములన్నిటికి
వందనములిడి - ముందుకు సాగగ
ఆశ్రమ భూమిని - కనిరి సగరులు

కపిల మహాముని కోపమునకు సగరపుత్రులు బూడిదగుట

234. తపోధనుడును - మహానుభావుడు
అఖండతేజుడు - నిర్మలాత్ముడగు
కపిల మహాముని - ఆశ్రమంబున
యజ్ఞాశ్వము గని - సగరకుమారులు
ఆ మునీశ్వరుడె - అపహరించెనని
వారి మనముల - అపోహపడిరి
ముసల ముద్గరా - ద్యాయుధములతో
దాడిచేసిరి ఆ - కపిలునిపై

235. యువనాశ్వమును - దొంగిలించితివి
పాతాళంబున - దాగియుంటివి
సగర మహీపతి - పుత్రుల మేము
సంహరించెదము - ఈ క్షణమందున
కపిలుడంత హుం - కారము జేసి
ఘోరవహ్నిని - సృష్టించగనే
అరువది వేల - సగర కుమారులు
దగ్ధులైరి ఆ - మంటల యందున

(39, 40వ సర్గలు సంపూర్ణం)

# 41 వ సర్గ

## అంశుమంతుడు తన పినతండ్రుల జాడకై ఏగుట

236. కాలమాగతిని - ఏగుచుండగా
సగరుడంతట - శోకతప్తుడై
తన కుమారుల - సంగతి కనుగొన
తన మనుమడగు - అంశుమంతు గని
నీ పినతండ్రులు - వెడలిన త్రోవనె
నీవరుగుము యువ - నాశ్వము కనుగొన
యాగభారమును - నీపై నుంచితి
అని పలికెను ఆ - సగర మహీపతి

237. పితామహుని ఆ - శీస్సు లందుకొని
తన పినతండ్రులు - వెడలిన బాటనే
అంశుమంతుడు - వెదకుచు బోయెను
మార్గమధ్యమున - మహాపద్మమను
దిగ్గజంబును - గాంచినంతనే
కడు నమ్రతతో - అంజలి ఘటించి
ఓ దిశాగజమ - సగర పౌత్రుడను
అంశుమంతుడని - పరలువాడను

238. అరువది వేల - నా పినతండ్రులు
యువనాశ్వమును — వెదకుచు వచ్చిరి
వారి జాడ నా - కెరుక పరచుమా
అని పలికెడి ఆ - అంశుమంతు గని

ఈ మార్గమున - ముందుకు బోయిన
యజ్ఞాశ్వమ్మును - గాంచెద వీవు
నీ పురమ్మునకు - గొనిపోయెదవు
యాగమంత సం - పూర్తి జేతువనె

239. దిశాగజము కడ - దీవెనలంది
అంశుమంతుడు - ముందుకు ఏగెను
ఏగిఏగి తా - చేర గలిగెను
కపిల మహాముని - ఆశ్రమంబును

కపిల మహాముని - కోపాగ్నిని బడి
తన పినతండ్రులు - భస్మమైతిరని
అరసినంతనే - అంశుమంతుడు
మనమ్ము ద్రవించి - దుఃఖితుడాయెను

240. పినతండ్రులకు - తర్పణము లొదల
జలముల కొరకు - వెదకుచుండగా

ఆ సమయంబున - వినత తనూజుడు
గరుత్మంతుడు - అటకు వచ్చెను

అరువది వేల - భస్మరాసులపై
పావన గంగ - ప్రవహించినచో

సాగరులకు - సద్గతులు గల్గునని
గరుడుడు చెప్పెను - అంశుమంతు గని

241. ఖగపతేంద్రుడు - తెలిపినదంతయు
అంశుమంతుడు - శ్రద్ధగా విని

మఖాశ్వమ్మును - చేకొనిపోయి
తాత యాగము - సఫలము జేసి

ఆ సుపర్ణుడు — చెప్పినదంతయు
సగరునకంతయు — విశదపరచగా

తన కొమరుల దు - ర్గతిని తలచుకొని
సగర మహీపతి - దుఃఖితుడాయెను

(41 వ సర్గ సంపూర్ణం)

# 42 వ సర్గ

242. ముప్పదివేల – వత్సరంబులు
ధరణిని ఏలి - సగర మహీపతి
దివిజ భావమును – జేరిన పిమ్మట
అంశుమంతుడు - రాజ్యమేలెను
అంశుమంతునకు - దిలీపుడనెడి
కడు ధర్మాత్ముడు - సుతుడు కలిగెను
గంగను ధరకు - తెచ్చుట కొరకు
రాజ్యభారము ది - లీపున కొసగెను

243. అంశుమంతుడు - అడవుల కేగి
ముప్పది రెండు - వేల ఏండ్లు
గంగకొరకు ఘన - తపమును జేసి
గొని తేలేక - అంశుమంతుడు
అంతిమ యాత్రను – జేసెను దివికి
అంశుమంతుని - అనంతరమున
సుతుడు దిలీపుడు - రాజ్యమేలెను
అతని కుమారుడు - భగీరథుండు

244. భవ్యగుణుడగు – భగీరథుని గని
రాజ్యభారమును - స్వీకరింపుమని
తన తాతలకు - పుణ్య కర్మలను
జేయుగ తాను - సంకల్పించి
తాతలనెటుల త – రింప జేతునని
తీరని వ్యథతో - కృంగి కృశించి
దిలీపు డరిగె - దివిజ పురమునకు
భగీరథుడంతట - రాజ్యమేలెను

245. పరమ ధార్మికుడు - భగీరథుండు
కొంతకాలమటు - పాలన జేసి
సంతతి లేమిచె - రాజ్య భారమును
మంత్రివర్యులకు - అప్పగించెను
గంగను పుడమికి - దెచ్చుట కొరకు
తనకు సంతతిని – గోరుట కొరకు
గోకర్ణమున పం - చాగ్నుల నడుమ
ధాతను గాంచగ - తపమొనరించెను

246. నలువ యపుడు - ప్రత్యక్షమాయెను
ఇక్ష్వాకులు ఇక - వర్థిల్లెదరని
వంశోద్ధారుని - పొందగలవని
పావని గంగను - గొని రాగలవని

గంగను ధరణి - భరించలేదని
గంగను దాల్చ స - మర్థుడు శివుడని
పరమేశునికై - తపము చేయుమని
అభయమొసగి చనె - నలువ యప్పుడు

(42 వ సర్గ సంపూర్ణం)

## 43 వ సర్గ

### భగీరథుడు గంగకై తపమాచరించుట

247. కాలి అంగుటు — కొనపై నిలచి
హస్త యుగ్మమును - పైకి జూపుచు
పరమ శివునికై - భగీరథుండు
విశ్రుతి మీరం - తపంబు జేయుగా
భువన గురుండగు - పార్వతీపతి
భగీరథుని ఘన - తపముకు మెచ్చి
ఏమి కావలెనో - కోరుకొమ్మనగ
సురగంగను ఈ - భువికి తెమ్మనె

248 ఆ భగీరథుని - కోరిక దీర్పగ
సురగంగను రమ్మ — నెను త్రినేత్రుడు
భీకర ధ్వనులతో - దివినుండి గంగ
పెను వేగముతో - ధరణిని దుముక
ఫాలనేత్రుడా - కాశ గంగను
జటాజూటమున - దాల్చెనంతట
శివుని శిరమున - చిక్కిన గంగ
ఆగిపోయెను — మార్గము లేక

249. పుడమిని గంగను - వదలి వేయుడని
ఫాలనేత్రుని - భగీరథు డడుగ

సంతస మొందిన - కాలకంఠుడు
ఆ భగీరథుని - కోర్కెను దీర్పగ

జటల ధరించిన - గంగను విడచెను
కడు సుందరమగు - బిందు సరసున

అటనుండి గంగ - ఏడు పాయలై
అవనీ తలమున - పొంగి పారెను

250. హ్లాదిని, పావని, - నళినీ యనెడి
నామములు గొని - మూడు పాయలై

తూరుపు దిశగా - పయనమాయెను
సుచక్షువు, సీత, - సింధూ యనెడి

పేరులు గొని మరి - మూడు పాయలై
పశ్చిమ దిశగా - పారసాగెను

భగీరథుని ర - థానుగామియై
ప్రవహించె గంగ - ఏడవ పాయగ

251. మత్స్య కచ్ఛప – జలచరములతో
ఉత్తుంగ తరంగ – పటు ఘోషలతో
ఒకపరి తాను - దౌడ వెళ్ళుచు
ఒకపరి తాను - మందగమనయై
ఒకపరి తాను - హంసగమనియై
నర్తకివలె తా - నాట్యము జేయుచు
హిమ శిఖరంబులు - దాటెను గంగ
భగీరథుని ర - థానుగామియై

జహ్ను మహాముని గంగానదిని ఆచమించుట

---

252. సుడులు తిరుగుచు - కొండల కోనల
వెల్లువెత్తి పరి - వహించెను గంగ
మార్గ మధ్యమున - జహ్నుమహాముని
దివ్యాశ్రమమును - ముంచెను గంగ
జహ్నుముని యంత - కడు క్రోధమ్మున
గంగనంతట – ఆచమించెను
అది తిలకించిన - దేవతలందరు
జహ్నుముని జేరి - ప్రార్థన జేసిరి

253. జహ్నుమునివరా - లోక హితార్థము
గంగామాతను - తనయిగ నెంచి

వదలి వేయుడని - పరిపరి వేడగ
మునివరుడంత - ప్రసన్నుడాయెను

యోచన జేసి - కర్ణముల నుండి
గంగను తిరిగి - పుడమిని వదలెను

జహ్నుని చేత - విడువబడుటచే
జాహ్నవి యనెడి - పేరు బడసినది

(43 వ సర్గ సంపూర్ణం)

# 44 వ సర్గ

254. పావని గంగ - ఆ భగీరథుని
రథమువెంట పా - తాళము జేరి
అరువదివేల - సగర కుమారుల
భస్మరాసులను - ముంచుచు పారి
సాగరులకు — సద్గతులు గూర్చెనని
స్వర్గ మర్త్య పా - తాళ లోకముల
పావనగంగ - ప్రవహించుటచే
త్రిపద గంగగా - పేరు గాంచెననె

255. భగీరథుండు - తర్పణలిడగ
సగర పుత్రులు - నాకమేగిరని
భగీరథుడు - రాజ్యమునేలగ
సిరులు సంపదలు - వృద్ధిచెందెనని
గంగా చరితము - వినిన వారికి
సర్వపాపములు — తొలగిపోవునని
గాధి నందనుడు - రఘు రామునకు
త్రిపద గంగా - చరితము నుడివెను

256. గంగ చరితమును - విని దాశరథులు
పరిపరి దలచుచు - రేయి యంతయు

నిదుర గానక - మేల్కొనియుండిరి
ప్రభాతంబున - గాధేయుని గని

ముని పుంగవులు — నావను బంపెను
భవదాగమనము — కోరుచుంటిరన

విశ్వామిత్రుడు - రామలక్ష్మణులు
ముని గణములతో - గంగను దాటిరి

(44 వ వర్గ సంపూర్ణం)

# 45, 46 వ సర్గలు

విశ్వామిత్రుడు సముద్ర మధనమును గూర్చి,
శ్రీరామునకు తెలియజేయుట

257. గంగను దాటి - రామలక్ష్మణులు
విశ్వామిత్రుని - వెంట నడువగా
గగన చుంబితా - సౌధమ్ములతో
సకల సంపదల - కాలవాలమగు
దివ్యపురము తిల - కించి నంతనే
కడు ఉత్తమమగు - ఈ పురినేలెడి
ధరణీనాథుని - ఎరుగదలచితిని
అని గాధేయుని - అడిగె రాముడు

258 మునివరు డంతట - మోదమునొంది
ఈ పురమును — వైశాలి యందురు
దేవ దానవుల - ఇరువురి కథను
వివరింతును మీ - రాలకింపుడని
కృత యుగంబున - సురాసురాదులు
మరణము లేక - యుండుట ఎటులని
మనమునందు కడు - చింతన జేసి
సుధను బొంద స్థిర - చిత్తులైతిరి

259. మంధరగిరిని — కవ్వముజేసి
ఫణివాసుకిని - తాడుగ జేసి

ఉదధినంత - మధియింపసాగిరి
వేయి వత్సరము - లటు మధింపగ

మంధర పర్వత - శిలల తాకిడిని
నాగేంద్రుడు సహి - యింప జాలక

హాలాహలమును - బయటకు చిమ్మగ
పృథ్వీతలమున - మంటలెగసెను

260. వేలుపులందరు - భయకంపితులవ
శారదాభవుడు — శూలిని జేరి

సాగర మథనము - కథ వివరించి
హాలాహలమును - ఆశ్వాదించి

సురలందర - రక్షింపవేడగా
అంబికాపతి — అభయమునిచ్చి

గరళమంత తన - గొంతునందునా
బంధించెను ఆ - పరమదయాళు

261. దేవ దానవులు - శ్రీహరి జేరి
భక్తిమీర అం - జలులు ఘటించి

మంధరమరిగె – రసాతల సీమకు
గిరిని బయటకు - తెమ్మని కోరగ

విష్ణువంత కూ - ర్మావతారుడై
పృష్ఠ భాగమున - గిరిని నిలుపగా

సుర సంఘంబులు - సాగర మథనము
వేయి వర్షములు - ముదమున సలిపిరి

262. దండ కమండల - ములను ధరించి
దేవ వితతికి - ప్రీతి పాత్రుడగు

ధన్వంతరి బుట్టె - మొట్టమొదటిగా
అటుపిమ్మట సలి - లంబులందునా

సురుచిరమగు – కమనీయ రూపులు
అప్సరసలు ఉద - యించి రంతట

సురలు అసురలు - ఒదలుట వలన
వేశ్యవృత్తి గొని - వారు చరించిరి

263. వరుణాత్మజయగు — సురనామముంగల
తరుణి పుట్టెను - తదనంతరమున

దానవులందరు - ఆమెను విడువగ
అమరులంత వరి - యించె నామెను

సురను బొందెడి - కారణమ్ముగా
అమరులు సురలను - నామము బొందిరి

సురను బొందని - కారణంబుగా
అసురులను పేరు - దానవులందిరి

264. సాగర మథనము — సలుపుచుండగా
ఉచ్చైశ్శ్రవమను - అశ్వము జనించ

ఇంద్రుడు గైకొని - ఏగె నాకము
అంత జనించెను - కౌంస్తుభంబనెడి

రత్నరాజమును - శ్రీహరి గొనియెను
పిమ్మట పుట్టెను - సుధారసంబు

దానిని గ్రోలగ - దేవదానవుల
నడుమ చెలరేగె - భీకర పోరు

265. ఉభయులందునా - పెక్కురు గూలిరి
ధర్మ రక్షణము - జేయు నిమిత్తము
మోహిని రూపము - దాల్చి విష్ణువు
దానవులందర - మోసము జేయుచు

దేవతలకు సుధ - పంచి ఇచ్చెను
దిక్పాలురతో - దేవ మునులతో
అలరారెడి ఆ - స్వర్గధామమును
శక్రుడంత శాం - తముగ నేలెను

దితి దేవేంద్రుని జయించు కుమారునికై తపస్సు జేయుట

266. తన కుమారుల - భంగపాటు విని
తప్త హృదయమున - తన పతి జేరి
తన కుమారులను - రణమున దునిమిన
సురపతి దునుము - కుమారుని కోరగ

కశ్యపుడంతట - కాంతను గాంచి
వేయి వర్షములు - తపమొనరించిన
మూడు జగములూ - మెచ్చెడి తనయుని
బడయగలవని - ఆశీస్సులు నిడె

267. పతి యానతిని - శిరమున దాలిచి
దీర్ఘ తపమును - దితి యొనర్చెను

ఇందుౖడావెను - అనుసరించి జని
పలుపలు విధముల - సేవలు జేయు

తొంబది శతముల - తొంబది ఏండ్లు
ఆటుల తపమును - ఆచరించి దితి

అమనాభు గని — అభిమానముతొ
దితి ఇటులనె - ఆనందముతో

268. పది వత్సరములు - తపము జేసిన
వేయి వర్షములు - పూర్తిగ నగునిక

ముజ్జగములను - నిన్ను జయించెడి
కడు ధీమంతుడు - శక్తిమంతుడగు

అనుజుడు నీకు - కలుగును గాన
క్షీరము నీరము - కలసిన రీతిగ

మీరిరువురును - కలసి ఈ జగతి
పాలింపుడని - ప్రీతిగ పలికెను

269. ఆ మాటలు విని - కపటి హృదయుడై
సమయము కొరకు - సురపతి వేచెను

యోగశక్తిచే-వజ్రమును గొని
దితి గర్భమున - వృద్ధి జెందెడి

శిశువును సప్త - ఖండములు జేయ
మారుద మారుద - మనుచు నాదము

వినబడినంతనె - మునిసతి లేచి
ఇంద్రుని గాంచి - ఇటుల పలికెను

270. చెరచెదవేలా — నా గర్భమును
బాలుని జంపి - పాపివైతివన

గర్భము నుండి - బయటకు వచ్చి
కరములు మోడ్చి - ప్రదక్షిణలు జేసి

నిర్మలమగు నీ వ్ర - త మంతయును
కలుషమయినది - ఈ దినమందున

కావున నేను - గర్భము ద్రుంచితి
నను మన్నింపగ - వేడుచుంటిననె

271\. అనిమిష నాథా - దోషమించుకయు
నీది కాదని - తెలుసుకొంటిని

నా గర్భమున - ఏడ్వురు సుతులు
ఉదయించెదరు - ప్రీతిని గావుము

మారుద యనుచు - పలికినవారు
మారుతులనెడి - నామము బడసి

ఆకాశమున - సంచరింతురని
దితి ఇంద్రుని గని - పలికెనప్పుడు

272\. మొదటి కుమారుడు - యావహాఖ్యగను
రెండవ సుతుడు - ప్రవహాఖ్యగను

మూడవ కొమరుడు - సంవహాఖ్యగను
నాల్గవ సుతుడు - ఉద్వహాఖ్యగను

ఐదవవాడు - వివహాఖ్యగను
ఆరవ తనయుడు - పరివహాఖ్యగను

ఏడవవాడు - పరావహాఖ్యగను
పేరులు బడసి - అలరారెదరు

273. బ్రహ్మ లోకమున - స్వర్గలోకమున
తారాపథమున - నాలుగు దిశలా

ప్రబలులగుచు నా - ఏడ్వురు సుతులు
సంచరించెదరు - తృప్తి మీరగా

అని పలికెడి తన - జననికి మ్రొక్కి
విధిప్రాతను శం - కించ వలదని

పలుంధీతుల ఓ - దార్చి అరిగెను
అమరధాముము - అమరాధిపతి

274. అమరేంద్రుడు ఈ - ధాత్రియందున
జనని దితికి కడు - సేవలు జేసెను

అటుపిమ్మట ఈ - ధరణి నంతనూ
ప్రభువిక్ష్వాకుడు - ఘనముగనేలెను

అతని సుతుడు - విశాలుడనువాడు
సారవివేక వి - శాల చిత్తుడు

వాని పేర ఈ - పురిని గట్టెను
ధర్మదీక్షతో - పరిపాలించెను

275. విశాలునికి సు - చంద్రుడు సుతుడు
సుచంద్రుని సుతుడు - ధూమ్రాశ్వుడు
ధూమ్రాశ్వుని సుతుడు - సృంజయు
డనువాడు
సృంజయునికి సహ - దేవు డుదయించె
సహదేవునికి - కుశాశ్వుడు బుట్టె
కుశాశ్వుని సుతుడు - సోమదత్తుడు
సోమదత్తునికి - కాకుత్స్థుడు బుట్టె
కాకుత్స్థుని సుతుడు - సుమతి
యనువాడు

276. నేడీ పురిని - ధర్మ నిరతతో
ఏలెడివాడు — సుమతి భూపతి
ఆ ఇక్ష్వాకు కు - లోద్భవులందరు
కడు ధర్మాత్ములు-విద్యాసాంద్రులు
ప్రజల క్షేమమును - కోరెడివారు
నేటి రేయి మన - మిచట గడపెదము
రే పరిగెదము - మిథిలా పురికని
రఘురాముని గని - గాధేయుడు పలికె

277. గాధితనయుడు - రుదెంచుట తెలసి
సుమతి ఎదురేగి - పూజలు సలిపి

రామలక్ష్మణుల - గాంచినంతనే
సింహగ మనమున - భాసిలువారు

శరచాపములు - కలిగినవారు
వృషభ శార్దూల - శౌర్యవంతులు

చంద్రిముఖులు - పద్మనేత్రులు
సురలను బోలు - తేజోవంతులు

278. భానుని కాంతితో - భాసిలువారు
శుభలక్షణములు - కలిగినవారు

ఇరురూపు లొకటిగ - అమరినవారు
దివినుండి భువికి - దిగి వచ్చితిరో

పాదచారులై ని - న్ననుసరించెడి
నవీన తేజులు - ఈ మహనీయులు

ఎవరి తనయులో - వినగోరితినని
గాధేయునితో - సుమతి పలికెను

279. అని పలికెడి ఆ - సుమతిని గాంచి
కౌశికుడంతట – కడు మోదముతో
అయోధ్యాధిపతి - దశరథేశుని
కొమరులు వీరు - రామలక్ష్మణులు
యాగము గాచి – అసురుల దునిమి
పతి అహల్యకు – శాపము బాపి
నీ గృహమున నున్న - శివచాపమును
జూడగ వీరు - వచ్చినారనె

280. ఆ పలుకులు విని - సుమతి మహీశుడు
రామలక్ష్మణుల - మహాతేజుల
తిలకించుట - నా భాగ్యమటంచు
ప్రమదము మీరగ - పూజలు సలుప
భాను కులీనులు – సంతసమంది
నాటిరేయి అట - గడపిరి ముదమున
ప్రభాతమ్మున - ముని గాధేయునితో
కలసి అరిగిరి - మిథిలాపురికి

(45 46 వ సర్గలు సంపూర్ణం)

# 47, 48 వ సర్గలు

## అహల్య చరిత్ర

281. గాధేయునితో - రామలక్ష్మణులు
కడు సుందరమగు - గహన సీమలను
గాంచుచు సాగిరి - మిథిలా నగరికి
నిర్జనత్వమై - ప్రాభవముడిగిన
శిధిలమైన ముని – వాటిక యొకటి
వారు గాంచిరి - వన మధ్యమున
ఆశ్రమమేల - ఇటులుండెనని
రాముడడిగె వి - శ్వామిత్రుని గని

28.. గౌతము డనెడి - ముని పుంగవుని
కడు పేరొందిన ది - వ్యాశ్రమమిది
ముని గౌతముడు - సతి అహల్యతో
తపమొనరించిన - పుణ్యాశ్రమమిది
సురలెందరో పూ - జించిన పుడమిది
అమరాధిపతి - సతి అహల్యపై
మరులు జెంది - రమించగ నెంచి
కాలము కొరకు - వేచియుండెను

283\. ఒక దినంబున - వేకువ జామున
ముని ఆశ్రమమున - లేని సమయాన
ముని గౌతముని - రూపును దాల్చి
అమరాధిపతి - ఆశ్రమంబున
ప్రవేశించె అ - హల్యను గూడగ
సురనాథుడు తన - పతిరూపము గొని
తనను కామించి - వచ్చినాడని
తెలిసి అహల్య - కూడి రమించెను

284\. నా కోరిక ఫలి - యించె నేటికని
నేటికి కృతార్థు - రాలనైతినని
అమరేంద్రునితో - అహల్య పలికి
పతి ఏతెంచెడి - సమయమాయెనని
శీఘ్రముగా ఇక - మరలి పొమ్మని
ప్రీతిగ పలికెను - దేవేంద్రుని గని
ఆ సమయంబున - నదీ స్నానము
ముగియించుకొని - గౌతముడొచ్చె

285. త్వరితముగా తా — నాశ్రమము వీడ
సురపతి దలచి - బయటకు రాగ

గుమ్మమ్ములో ఎదు - రాయె గౌతముండు
అనిలునితో స — మాన తేజుడగు

ముని గౌతముని - గాంచినంతనే
కంపితాంగుడై - భీతి జెందెను

గౌతముడంతట - దివ్య దృష్టిచే
ఆతడింద్రుడని - ఇట్టె గ్రహించెను

286. వంచనతో తన - రూపును దాల్చి
కామముతో తన - ఆలిని చెరచిన

దేవనాథుని - గాంచినంతనే
రతికేళీశంక - పొల్పొడకుండగ

వృషణములు తెగి — నేల గూలునని
కడు కోపించి — శాపమొసగెను

శాపవశమున - అనిమిషనాథుని
అండములు తెగి - నేలను బడెను

287. అటు పిమ్మట ముని - తన ఆలిని గని
కామాంధతో - అన్యుని గూడి
వంశ ధర్మమును - విస్మరించితివి
సర్వ ప్రాణులకు - కనబడకుండగ
దుమ్ములో పడి - చలించకుండగ
అన్నపానములు - ఆరగించక
వాయుభక్షణము - జేయుచు నీవు
పలు వేలేండ్లు - పడియుండుమిట

288. పతి పదముల బడి - రోదించె అహల్య
పాపమునకు పరి - హార మెప్పుడన
రఘుకులేంద్రుడు - రామచంద్రుడు
ఇట తన పాదము - మోపినప్పుడు
శుద్ధినొంది నను - జేరుకుందువని
శాపోపశమన - మహల్యకు జెప్పి
గౌతము డరిగె - తపము జేయగా
కడు దుఃఖితుడై - హిమాలయములకు

(47 48 వ సర్గలు సంపూర్ణం)

# 49వ సర్గ

## రాముడహల్యకు శాపవిమోచనము జేయుట

289\. అటు లముష్కుడు - అయిన సురపతి
అనిమిషు లందర - జేరగ బిలచి
ముని గౌతముని - ఘోరతపమునకు
అంతరాయము - జేయగ నెంచి
మునిసతి గూడి - రమించిన నన్ను
ముష్క హీనునిగ - శాపమిడెనని
తనకు అండములు - తిరిగి అమరుటకు
తగిన కార్యము - యోచింపుమనె

290\. వజ్రియుధుని - దీనదశను గని
సురలందరును - యోచించుకొని
మేషాండములను - రయమున దెచ్చి
అమరేంద్రునకు - అమరించినారు
నాడు మొదలుకొని - మేషాండుడని
ఇంద్రు డంతట - పేరొందినాడని
విశ్వామిత్రుడు - రఘురామునకు
అహల్య చరితము - విశదపరచెను

291. పవలు రేయనక - నిను ధ్యానించుచు
ఎండ వానలకు - ఒడలు సడలగా

శృంగి కృశించిన - గౌతముని సతి
నీ పదముల కెం - ధూళి సోకగా

నీ రాక కిట - వేచియున్నది
అహల్యాసతికి - గ్రక్కున నీవు

శాప విముక్తిని - జేయుము రామా
అని నుడివెను - గాధేయుడప్పుడు

292. ముని గౌతముని - ఆశ్రమమందు
రామచంద్రుడు - అడుగిడినంతనె

రామపాదము - సోకి అహల్య
తొల్లి రూపమున - తేజరిల్లెను

ప్రణతులిడిన — శ్రీరామ లక్ష్మణుల
పలురీతుల - పూజించె అహల్య

రఘుకులేశుడు - వచ్చుట తెలసి
గౌతముడొచ్చి గ్రి - హించె నహల్యను

( 49 వ సర్గ సంపూర్ణం)

# 50వ సర్గ

## రామలక్ష్మణులు మిథిలానగరము జేరుట

293. రామలక్ష్మణులు - గాధేయునితో
మిథిలా నగరిని - జేరుకొనినారు

జనక మహీపతి - యజ్ఞము జూడగ
వెడలిరి వారు - ఈశాన్యమునకు

అచ్చెరు వొందెడి - యజ్ఞవాటికను
వేదవిధులగు - పురోహితులను

పలు దేశముల - అధినాథులను
గాంచినంతనే - సంతసమొందిరి

294. జన సందోహము లేని - నిలయమున
గాధేయాదులు - విశ్రమించిరి

విశ్వామిత్రుని - ఆగమనమును
చెవి సోకగనే - జనక మహీపతి

శతానందుని - వెంట నిడుకొని
గాధి సుతునకు - పూజలు చేసి

సూర్యచంద్రుల - సమాన తేజులగు
యువకు లెవరని - అడిగె కౌశికుని

295. దశరథేశుని - తనయులు వీరు
రామ లక్ష్మణు - నామధేయులు
తాటక సుతులను - గూల్చినవారు
నా యాగమును - గాచినవారు

అహల్య శాపము - బాపినవారు
నీ యింట నున్న - శివచాపము గన
వచ్చినారలు - కుతూహలమున
అని బదులిడె - విశ్వామిత్రుఁడు

(50 వ సర్గ సంపూర్ణం)

## 51వ సర్గ

296. రా పురోహితుడు - శతానందుడు
తల్లి అహల్యకు - శాపముడిగెనని
తల్లి దండ్రులు - కలసినారని
లోకపూజ్యుని - శ్రీరఘు రాముని
జననీ జనకులు - సేవించిరని
తెలిసినంతనే - శతానందుడు
రాముని గాంచి - పరవశుడాయెను
కుశి తనయుని - వేనోళ్ళ బొగడెను

శతానందుడు రామునికి విశ్వామిత్రుని చరిత్ర చెప్పుట

---

297. మము ధన్యులుగా - జేయుగ నెంచి
ఇటకు వచ్చితివి - దశరథ రామా
విశ్వామిత్రుడు - మహాప్రభావుడు
అట్టివాడు నీ - రక్షకుడాయెను
ఎంత ధన్యుడవో - రఘువర నందన
అని బహురీతుల - పొగడి రాముని
శతానందుడు - బ్రహ్మర్షి కథ
విన్నవించెను - ఈ విధంబుగా

298. నలువ కుమారుడు - కుశనాభుండు
ఆ వంశమున జ - నించిన వీరుడు
గాధి తనయుడు - విశ్వామిత్రుడు
ధరణీతలంబును - ఏలినవాడు
దిగంతముల జ - యించిన శూరుడు
జయజయధ్వనులతో - మరలు మార్గమున
కడు సుందరమై - మనసలరించెడి
ఆశ్రమ మొకటి - వారి కనులబడె

299. నానావిధ ఫల - పుష్పజాతుల
బహు విహంగముల - విలసితమయిన
అనలముతో స - మాన తేజులగు
బ్రహ్మర్షుల దే - వర్షుల తోడ
శోభించెడి ఆ - దివ్యాశ్రమము
వశిష్ఠ మహా ము - నిదని తెలిసి
గాధేయుడందు - ప్రవేశించి తా
వినయమ్ము తోడ - వందనములిడె

(51 వ సర్గ సంపూర్ణం)

# 52, 53, 54 వ సర్గలు

300. విశ్వామిత్రుని - గాంచి వసిష్టుడు
కడు విధంబుల - సత్కరించెను

కుశలములన్ని - అరసిన పిమ్మట
తన అతిధ్యము - స్వీకరింపుమని

ముని వసిష్టుడు - కోరె కౌశికుని
నీ ప్రియోక్తులకు - మోదమొందితిని

నీ వొసంగిన — మధుర ఫలములను
ఆరగించి కడు - తృప్తి బొందితిని

301. అని పలికిన అ - గాధేయుని గని
ముని వసిష్టుడు - కోరెను పరిపరి

భూకాంతుడంత - సమ్మతించగా
శబల యనబడు - కామధేనువును

విందుకు వలయు - భక్ష్య భోజ్యములు
సమకూర్చుమని - ఆదేశింపగ

షడ్రస సోపేత - మృష్టాన్నములు
సమకూర్చె శబల - క్షణమాత్రమున

302. వసిష్టు డంతట - గాధేయాదుల
ఉచిత రీతిని - దోడ్కొని వచ్చి

ఉచితాసనమున - కూర్చుండగ జేసి
హేమ పాత్రములు - సర్వ భక్ష్యములు

విందు జేసెను - తృప్తి బొందగ
సురభి మహిమ - కనుగొన్న కౌశికుడు

అపహరింపగా - యూహను జేసి
వశిష్ఠ మునితో - ఇటుల పలికెను

303. ఓ మహాత్మా - నే నిచ్చెద
లక్ష గోవులను - హేమరాసులను

సురుచిరమైన - సైరిభవరంబులను
గోరత్నము ఈ - కామధేనువు

రత్నములు భూ - పతులకె సొమ్మని
నీ కెరుక గద - ఓ మునివర్యా

కావున శబలను - నాకొసగుమని
విశ్వామిత్రుడు - వేడె వసిష్టు ని

304. గోగణంబులు - కోటి ఇచ్చినను
హేమరత్నముల - రాసులిచ్చినను
యజ్ఞాదుల కా - ధారమగుదాని
బహు విద్యలతో - వరలుదానిని
తపో ఫలితముగ - వచ్చినదానిని
ఎల్ల సమయముల - నన్ను వీడని
నా శ్రేయస్సును - కోరుకొనుదాని
నీ కొసంగుట - తగదని తెలిపె

305. వసిష్ఠుని గని - విశ్వామిత్రుడు
ఈ క్షణమందే - కామధేనువును
సేనలచే ఈడ్పిం - చుకు బోయెద
అని అనతి నిడె - తన సేనలకు
తనను హరించు - శత్రు సేనలను
అణచి వేయుటకు - అనుమతి నిమ్మని
కడు రోదించుచు - కామధేనువు
ముని వసిష్ఠుని - వేడెను మరిమరి

(52, 53, 54 వ సర్గలు సంపూర్ణం)

# 55 వ సర్గ

## శబలను గొనిపోవుటకు విశ్వామిత్రుడు యత్నముజేసి భంగపడుట

306. దివ్య తపః ఫల - మంత్రశక్తిచే
సురభి సృజించెను - మహావీరులను
శస్త్రాస్త్రములను - కైల నిడుకొని
మనుజ కాంతుని - సేనల ద్రుంచెను
కౌశికుండు పటు - కోపము జెంది
తన సైన్యము ద్వి - గుణీకృతి జేయుగ
ముని వసిష్టుడు - శబలను గాంచి
బహుళముగా సృ - జియింపు సేనలన

307. సురభియంత ని - నాదము జేయుగ
భీకరులగు ప - ష్లవులు బుట్టిరి
శబల పొదుగున - ఉద్భవించిరి
శూర వీరులగు - సైనికులెందరో
యోనియందు య - వనాళి జనించెను
శకృత్ప్రథమున - శకృలు బుట్టిరి
రోమకూపముల - మ్లేచ్ఛులు జనించె
దుష్టుల ద్రుంచగ - రణమునందున

308. అటుల జనించిన - సేనలనంతటి
విశ్వామిత్రుడు - తుద ముట్టించి

తన శత సుతులకు - ఆనతి ఇడెను
ముని వసిష్ఠుపై — దాటి కరుగమని

దాడికి దిగిన - కౌశిక సుతులను
తన నయనాగ్నుల - భస్మము జేసె

నిహత సుతులను - గాంచి కౌశికుడు
మనమున ఎంతో - వ్యథను బొందెను

309. నిర్వేదమగు - జలనిధి పోలె
కోరలు దీసిన - పన్నగము పోలె

ఘనములు కప్పిన - దినకరుని వలె
ఱెక్కలు ద్రెళ్లిన - విహంగము వలె

కాంతి హీనమగు - కాసారము వలె
శిశిరమునందున - వృక్షము పోలె

పదవీచ్యుతుడైన - పతిభుని రీతిగా
దర్పహీనుడై - అరిగె పురమునకు

310. గుణ భూషణుడగు - తన పుత్రునకు
రాజ్య భారమును - భుజముల నిడి
హిమవత్పర్వత - సానువు జేరి
పురహరు గూర్చి అ - చంచల భక్తితో
తపమొనరించె - పలు వర్షములు
కౌశికు తపము - మెచ్చి త్రినేత్రుడు
దివ్యాస్త్రములను - ధనుర్వేదమును
ప్రీతిగ నొసగెను - గాధేయునకు

(55 వ వర్గ సంపూర్ణం)

# 56వ సర్గ

## వసిష్ట విశ్వామిత్రుల యుద్ధము

311. దివ్యాస్త్రములను - పొంది కౌశికుడు
బలదర్పితుడై - వసిష్టు జేరి
అనలాస్త్రమును - ప్రయోగించగా
ఆశ్రమమంతయు - భస్మమాయెను
పక్షులు మృగములు - ముని జనంబులు
ఆక్రందించుచు - పరువిడి బోయిరి
అటుపిమ్మట గా - ధేయ తనయుడు
గ్రక్కున విడిచెను - ఆగ్నేయాస్త్రము

312 ముని వసిష్టుడు - బ్రహ్మదండమున
ప్రతిహతమొనర్చె - బ్రహ్మదండము
మహా ఉగ్రుడై - కౌశికు డంతట
తన దరిగల ది - వ్యాస్త్ర సంపదను
నిర్దుష్టముగా - ప్రయోగించెను
వసిష్టు డంతట - బ్రహ్మ దండమున
సర్వాస్త్రములను - కడు మెలకువతో
నిగ్రహించెను - దరహాసముతో

313. దివ్యాస్త్రములను - నిగ్రహించిన
వసిష్ట మునిపై - కడు క్రోధించి
కౌశికుడంతట - బ్రహ్మాస్త్రమును
గ్రక్కున విడిచెను - ఆ వసిష్ఠుపై
బ్రహ్మదండముచె - బ్రహ్మాస్త్రమును
బంధన జేసి - మ్రింగె వసిష్ఠుడు
బ్రహ్మాస్త్రమును - కబళించుటచే
ప్రళయ భయంకర - రూపము నొందెను

314. ప్రళయ కాలమున - మహాశివుని వలె
తాండవించెను - ముని వసిష్ఠుడు
రోమ రోమముల - ధూమములెగసెను
శరీరమంతట - జ్వాలలు రేగెను
దేవగణములు - నివ్వెర జెందిరి
మునివరులంత - వసిష్ఠుని జేరి
శాంతింపుమని - ప్రార్థన జేయగ
ముని వసిష్ఠుడు - శాంతము నొందెను

(56 వ సర్గ సంపూర్ణం)

# 57 వ సర్గ

315. దివ్యాస్త్రములను - బ్రహ్మదండము
ప్రతిహతమొనర్చె - యుద్ధమునందు
కావున ఇపుడు - తెలుసుకొంటిని
బ్రహ్మబలముపై - క్షత్రియబలము
దాడి చేసినా - వీగిపోవునని
కావున నే సా - ధించగ వలెను
బ్రహ్మ ఋషిత్వము - ఏ విధినైనా
అని తలపోసెను - కౌశికుడంతట

316. ఆ వసిష్ఠుని - రణమునందున
ఎటులైనను - ఓడించవలెనని
విశ్వామిత్రుడు - దక్షిణాదిశగా
పయనమాయెను - తపము జేయుగ
తారను గూడి - వన మధ్యంబున
వేయి వర్షము లు - తపము జేయుగ
కంజోద్భవుడు - అట కేతెంచి
సంతసించితిని - ఘోరతపమున కనె

317. రాజఋషిగ ఇక - అలరారెదవని
దీవించి చనె - శారదాధవుడు

కఠిన తపమునకు - ఇదియా ఫలమని
కార్యమంతయు - వమ్మాయెనని

విశ్వామిత్రుడు - కడు చింతించి
బ్రహ్మపదమును - పొందువరకును

తిరిగి తపమును - జేయుగ నెంచి
కఠోర తపమును - అరంభించెను

(57 వ సర్గ సంపూర్ణం)

# 58వ సర్గ

## త్రిశంకుని చరిత్ర

318. ఇక్ష్వాకుల వం - శమున జనించిన
భూనాథుడు త్రి - శంకు డనువాడు
నిజదేహమున - నాకమేగుటకు
యోగ్యమైన ఒక - యాగము జేయగ
మనము నందున - సంకల్పించి
కులగురువైన - వసిష్ఠుని కోరగ
అది అసాధ్యము - మానవాళికని
త్రిశంకుని గని - పలికె వసిష్ఠుడు

319. అంత త్రిశంకుడు - శుద్ధమతులగు
వసిష్ఠు తనయుల - జేరి పలికెను
బొందితోడ నే - స్వర్గ మేగుటకు
యాగము జేయు - వసిష్ఠుని జేరి
పరిపరి విధముల - ప్రార్థించితిని
నా ప్రార్థన తా - నిరాకరించెను
మీరా యాగము - నిర్వర్తించి
నా కోరిక మన్నిం - పుడని వేడ

320. తమ జనకునికి - సాధ్యపడని పని
తమ కెవ్వరికీ - సాధ్యము కాదని
కులగురువైన వ - సిష్టుని గాదని
అన్యుల జేరుట - అపచారమని
జగదర్చితుడు - తమ జనకుండని
అతని పలుకులు - వ్యర్థము గావని
కావున నీవు - వచ్చిన దారినె
మరలిపొమ్ము ఓ - జననాథా యనె

321. అటుల నుడివిన - వాసిష్టుల గని
మీ జనకుడు నను - తిరస్కరించె
మీరు కూడ సా - ధ్యము గాదనిరి
కావున నేను - అన్యుని జేరెద
అని పలికిన ఆ - త్రిశంకుని గని
వాసిష్టులంత - కోపము జెంది
ఛండాలుడవై - జీవించుమని
శపియించిరి త్రి - శంకు భూపతిని

(58 వ సర్గ సంపూర్ణం)

## 59వ సర్గ

322. ముని కుమారుల - శాపవశముచే
తనువు మారెను - కాలిన రీతిగ
కాంచనమయమగు - పీతాంబరములు
క్షణమున మారెను - నీలవర్ణముగ
రత్న ఖచితమగు - ఆభరణములు
వెలవెల బోయెను - కాంతిహీనమై
మెత్తని కురులు - మొరటుబారగ
చండాలాకృతి - దాల్చె త్రిశంకుడు

323. చండాలాకృతి - బొంది త్రిశంకుడు
గాధి తనయుని - ఆశ్రయించెను
తన కోరికను - ఎరుకపరచెను
జరిగినదంతయు - విశదపరచెను
ముని వసిష్ఠుపై - పగగొని యున్న
విశ్వామిత్రుడు - ఆ త్రిశంకు గని
సవనము సలిపి - బొందితోడ నిను
నాకలోకమున - కంపెద నంటిడు

(59 వ సర్గ సంపూర్ణం)

# 60 వ సర్గ

324 కౌశికుడంతట - తనయుల బిలచి
క్రతువుకు వలసిన - వస్తు సంతతులు

సమకూర్చుడని - అనతినిచ్చెను
శిష్య గణంబును - జేరగ బిలచి

యాగము గాంచగ - ద్విజోత్తములకు
వర్తమానములు - పంపుడు మీరన

ముని గణంబులు - తాపసోత్తములు
క్రతువును జూడగ - అట కేతెంచిరి

25. యాగ దీక్షితుడు - ఛండాలుండు
యాగ నిర్వహకుడు - క్షాత్రతల నాథుడు

ఏ లీలగ మునీం - ద్రు లందరును
భుజియించెదరు - పానభక్ష్యములు

హవనము గొనగ - అమర వర్గములు
ఎటు లేతెంతురు - యజ్ఞవాటికకు

ఈ ఛండాలుడు - అమరధామమును
ఎటు లేగెదడని - మునివర్గములనె

326. యాగము వలదని - వారు దెలిపిన
గాధేయుడు కో - పించి శపించని

మనమున దలచిన - మునిపుంగవులు
యాగము వారు - నిర్వర్తించిరి

హవిర్భాగమును - స్వీకరింపుడని
దేవేంద్రాదుల - నాహ్వానించెను

సురాదులెవ్వరు - రాకుండుట గని
విశ్వామిత్రుడు - శపధము జేసెను

327. ధరణీనాథ - ఓయి త్రిశంకా
నా తపః ఫలము - అంతయు నీకు

ధారబోసి నిను - స్వర్గధామము
బంపెద నేను - ఈ క్షణమందున

అని గాధేయుడు - తపోమహిమచే
త్రిశంకుని స్వ - ర్గమునకు జేర్చగ

దేవేంద్రాదులు - ఆ త్రిశంకు గని
తల్లక్రిందులా - పుడమిని ద్రోసిరి

328. తల్లక్రిందుల త్రి - శంకుడు బడచు
విశ్వామిత్రా - నన్ని గతిని

పుడమిని బడ - శాసించె శక్రుడు
నను కాపాడగ - వేడుచుంటినని

ఆర్తనాదమును - జేసె త్రిశంకుడు
కౌశికుడంత - త్రిశంకుని గాంచి

స్వర్గమునకు ప్రతి - సృష్టిని జేసి
అందు త్రిశంకుని - ఉంచగ నెంచెను

329. ముని మనమును గ్ర - హించిన సురలు
భ్రాంతిని జెంది - పటు రయమ్మున

కౌశికు జేరి - ఇటుల పలికిరి
మహాభాగ ఈ - నరనాథుండు

గురు శాపమును - బొందినవాడు
బొందితోడ దివి - జేరకూడదని

సృష్టికి ప్రతి సృ - ష్టి జేయవలదని
పరిపరి విధముల - వేడె కౌశికుని

330. నిజదేహమున - దివి కంపెదనని
బాస జేసితిని - ఈ త్రిశంకునకు
నాకభూలోక - మధ్య భాగమున
జ్యోతిర్మండల - మునకు వెలుపల
నే సృజియించిన - స్వర్గమునందు
సురభోగముల - తేలియాడుచు
అందు త్రిశంకుడు - తల్లకిందుల
దేవేంద్రుని వలె - తేజరిల్లునని

(60 వ సర్గ సంపూర్ణం)

# 61, 62, 63 వ సర్గలు

విశ్వామిత్రునకు నలువ బ్రహ్మఋషిత్వ మొసగుట

331. తన తపమునకు - అంతరాయము
కలుగు ప్రాంతము - ఉండగరాదని
పశ్చిమ దిశగా - కౌశికుడేగెను
వనాంతరముల - పుష్కర తటిని
తపము సేయుగా - నిశ్చయించుకొని
ఫల మూలముతో - ఆహారముగా
నిష్ఠా గరిమల - పలు వర్షమ్ముల
గాధేయుడట - తపము జేసెను

332. విశ్వామిత్రుని - ఘోర తపమునకు
మెచ్చి విరించి ప్ర - త్యక్షమాయెను
సంతసించితిని - నీ తపమునకు
ఋషిత్వ పదము - నీకొసగితి నన
ఇంత తపమునకు - ఇదియా ఫలమని
బ్రహ్మ పదమును - బడయుట కొరకు
తిరిగి తపమును - ప్రారంభించగ
దేవగణములు - భీతి జెందెను

333. అది గాంచిన - దేవేంద్రుడంతట
కౌశికు తపము - భగ్నము జేయగ

దేవకాంతలలో - కడు రూపసి యగు
మేనక నంపెను - తపోభూమికి

విద్యుల్లతవలె - ప్రకాశించెడి
మేనకను గని - ముగ్ధుడాయె ముని

ఆమెతో కూడి - రమించవలెనని
చేర బిలిచెను - ఆశ్రమమ్మునకు

334. మేనక ముదమున - సమ్మతించగా
విశ్వామిత్రుడు - మన్మథవశుడై

పది వర్షమ్ములు - పగలు రేయనక
కామక్రీడల - కాలము గడపెను

కడకొక దినమున - కన్నులు దెరచి
అది యంతయు - సుపర్వుల పనియని

బాలిసుండనై - మోసపోతినని
చేసిన పనికి - కడు చింతించెను

335. అటు తపించిన - కౌశికుడంతట
పంపివేసె అం - దుండి మేనకను

తన తపమంతయు - వ్యర్థమాయెనని
కామ విజయము - బొందగ నెంచి

ఉత్తరమున శ్రీ - తాద్రిని జేరి
కౌశికీ నదీ - తీరము నందున

శత వర్షమ్ములు - తపము జేయగా
నలువయంత ప్రి - త్యక్షమాయెను

336. విశ్వామిత్రుని - నలువ మెచ్చుకొని
నేటినుండి బ్రి - హ్మర్షి వైతివని

వరము నొసగిన - నలువను గాంచి
ఇంత తపమునకు - ఇదియా ఫలమన

మద మచ్చరములు - విషయ వాంఛలు
అధిగమించి జి - తేంద్రియత్వమును

పొందువరకు ఘన - తపము జేయుమని
నలువ నుడివెను - గాధేయునితో

337. బ్రహ్మ ఋషిత్వము - పొందువరకును
తపమును వీడనని - దీక్ష వహించి
పంచాగ్నుల మధ్య - మున నిలచుకొని
ఊర్ధ్వ ముఖంబుగ - కరములు చాపి
ఎండ వానలకు - చలికి చలింపక
వాయు భక్షణముజేసి కౌశికుడు
ఘోర తపంబును - ఆచరించగా
దేవతలందరు - భీతి జెందిరి

(61, 62, 63 వ సర్గలు సంపూర్ణం)

# 64 వ సర్గ

## విశ్వామిత్రుడు రంభను శపించుట

338. ఇంద్రుడంతట - రంభను పిలచి
విశ్వామిత్రుని - చెంతను జేరి
వాని స్థిరత్వము - భగ్నము జేయుము
అని శాసించిన - వజ్రాయుధు గని
ఉగ్రతపంబున - ఉన్న కౌశికుడు
నన్ను గాంచిన - శాపమిడు కదా
కావున నేను - అరుగజాలను
వేరొక మార్గము - ఆలోచింపుడు

339 అని పలికిన ఆ - రంభను గాంచి
భయము వీడుము-ధైర్యము బూనుము
బాల సమీరుడు - సుమసాయకుని
తోడుగ నేను - గొని వచ్చెదను
నీవు జయంబును - పొందుట తథ్యము
ఆలోచింపక - అరుగుము నీవన
కౌశిక తపము - భగ్నము జేయగ
రంభ వెడలెను - తపోభూమికి

340. బాల సమీరుడు - మెల్లగ వీవగ
సుమశరుడంత - సువాసనలు జల్ల

రంభ రమ్యముగ - నాట్యముజేయుచు
పంచమ శృతిలో - గానము జేయగ

తన తపమ్మును - భగ్నము జేయగ
వాసవు డంపిన - రంభను కనుగొని

గండశిలగ వే - యేండ్లు యుండుమని
గాధేయుడు శ - పియించె రంభను

(64 వ సర్గ సంపూర్ణం)

# 65 వ సర్గ

341. కోపము బూని - శపియించుటచే
మరల తన తపము - భంగమాయెనని

కౌశికుడంతట - మది చింతించి
కామ క్రోధముల - బయటకు నెట్టి

కడు క్షేమంబగు - ఈ దేహమును
బ్రహ్మ ఋషిత్వము - పొందునందాక

శుష్కింపగ నే - జేయునెంచితని
ప్రతిన బూనెను - విశ్వామిత్రుడు

342. అని తలచి ఆ - ఋషివరుడంతట
తూర్పు ముఖముగా - పయనమాయెను

స్వర్గాధిపతి - సలుపు విఘ్నములు
లెక్కజేయక - శత వర్షములు

శ్వాస బంధించి - నిరాహారిగా
ఘనతపంబును - జేసినంతనే

మూర్ధమందున - ధూమము లెగయుగ
ముల్లోకములు - కలవర జెందెను

343. కౌశికు శిరమ్మున - ధూమ మెగయుగ
దిక్కులన్నియు - సంచలించెను
పృధివీతలము - వణకసాగెను
కర్మసాక్షికి - కాంతులు తరిగెను
హవ్యవాహనుడు - శీతలుండాయెను
సాగరుడంతట - పొంగి పొరలెను
భుజబలుడు - ఉద్ధతిని వీచెను
కర్మకులెల్ల ఆ - కర్మకులాయెను

344. అది గాంచిన ఇం - ద్రాది దేవతలు
భయకంపితులై - తరలి వచ్చిరి
గాధి తనూజా - సంతసించితిని
బ్రహ్మ ఋషిత్వము - నీకొసగితినని
నలువ ప్రీతిగా - పలికినంతనే
విశ్వామిత్రుడు - తృప్తిని బొంది
కడు వినయమ్ముగా - బ్రహ్మకు ప్రణమిల్లి
తన కోరికను - ఈ విధి తెల్పెను

345.ముని వసిష్టుడు - చెంతకు వచ్చి
బ్రహ్మర్షీ యని - పిలచిన గాని

తృప్తి చెందనని - కౌశికుడనగా
నలువ యంత - వసిష్టుని పిలువగ

ముని వసిష్టుడు - రయమున వచ్చి
విశ్వామిత్రుని - గాంచినంతనే

బ్రహ్మర్షీ యని - ప్రీతిగ బిలచి
ఆలింగనము - జేసెనప్పుడు

346. ముని వసిష్టుని - విశ్వామిత్రుడు
అతి ఘనముగ - పూజించి పంపెను

మహోత్కారుడు - మహాభాగుడు
ధర్మపరుండు - తపోధనుండు

ధరణియంతయు - తిరిగినవాడు
మునిశ్రేష్టుండు - విశ్వామిత్రుడు

అని నుడివెను గా - ధేయుని చరితము
శతానందుడు - రాముని వినుమని

347. బ్రహ్మర్షియైన - మహాభాగుని
చరితము విని - నే ధన్యుడనైతిని

అని పలికిన ఆ - జనక మహీపతి
విశ్వామిత్రుని - పూజించుకొని

దశరథ తనయుల - నిడుకొని వచ్చిన
ముని కౌశికునకు - కృతజ్ఞతలిడి

మరుసటి దినమున - దర్శింతునని
అనుమతి గైకొని - అరిగె జనకుడు

(65 వ సర్గ సంపూర్ణం)

# 66వ సర్గ

## జనక మహీపతి శివధనువును గూర్చి తెలియజేయుట

348. మరుసటి దినమున - జనక మహీపతి
ముని గాధేయుని - రామలక్ష్మణుల
యథావిధిగ - సన్మానము జేసి
వచ్చిన పని శల - విన్మని గోరగ
కౌశికుడంత - జనకుని గాంచి
తామరసాప్త - కులాబ్ధిచంద్రులు
దశరథ సుతులు - రామలక్ష్మణులు
శివచాపము గన - వచ్చినారనె

349. తనను పిలవని - దక్షుని యాగము
ధ్వంసము జేయుగ - ఉగ్రరూపుడై
ధనువు విడుకొని - నీలకంఠుడు
ఏగుదెంచెను - యజ్ఞవాటికకు
హవిర్భాగము - తన కీయకనే
స్వీకరించిన - సురలను గాంచి
వారి శిరములు - త్రుంచగ బూనిన
పరమశివుని గని - భీతి జెందిరి

350. భీతావహులగు - అమరులంతటను
శివుని స్తుతించి - ప్రసన్నుని జేసిరి

పరమేశ్వరుడు - దేవ గణములకు
శివధనస్సు నిడి - మరలిపోయెను

మా పూర్వీకుడు - దేవరాతుడు
సురలనుండి శివ - ధనువును బొందెను

నాటినుండి మా - ఇంట నున్నది
నిత్య పూజలు - గైకొనుచున్నది

జనకుడు సీత జన్మ వృత్తాంతము దెలుపుట

351 ఒకపరి నేనొక - క్రతువును జేయుగ
యాగభూమిని - దున్నుచుండగా

నాగలి కొమ్మున - నాకు లభించెను
దివ్యకాంతుల - తేజరిల్లెడు

ముద్దుపాప ఒక - పెట్టె యుందున
నాగటి చాలున - జన్మించుటచే

సీత యను పేరు - పెట్టుకొంటిని
ప్రాణముకన్నను - పెంచితి మిన్నగ

352. శివచాపమును - ఎక్కు పెట్టగల
వీర్యవంతునకు - సీతనిత్తునని
ప్రకటన జేసి - పత్రములంపితి
రాజవరేణ్యులు - యత్నము జేసి
భంగము నొంది - తిరిగిపోయిరి
కన్న తనయను - నే నొసగుటకు
ఇష్టము లేక - అటు జేసితినని
నాపై పగగొనె - రాజులెందరో

353. అటు పిమ్మట - వారందరు గూడి
ముట్టడి జేసిరి - మిథిలాపురిని
అంతట నేను - తపమొనరించి
సకల దేవతల - ఆరాధించి
పొందితి నేను - కడు సేనలను
శత్రువుల పైన - రణమును జేయ
ప్రాణములరచేత - బట్టుకొనివారు
పరుగులిడితిరి - యూజిని వీడి

(66 వ సర్గ సంపూర్ణం)

## 67 వ సర్గ

రఘురాముడు శివధనుర్భంగము గావించుట

354. కౌశికు మునివరు - కోరిక దీర్చగ
జనకుడు పలికె - మంత్రులను గని
శివచాపమును - యాగశాలకు
కడురయమున - రప్పించుడు అనగా
బలవంతులగు - భటు సముదాయము
శివ ధనువును ర - ప్పింపగ బంపిరి
అష్ట చక్రముల - ఇనుప పేటికలో
ఉన్న ధనువును - లాగుచు దెచ్చిరి

355. గరుడ గంధర్వ - కిన్నెరాదులు
సురలుగాని మరి - అసురులు గాని
నేటివరకు ఈ - శివధనుస్సును
ఎక్కుపెట్టగా - విఫలము జెందిరి
తుదకు వారు - కదలించరైతిరి
నా సంకల్పము నె - రవేరు సమయము
ఎపు డేతెంచునో - అని వ్యధనొంది
గాధేయుని గని - జనకుడు పల్కెను

356. గురు కౌశికునకు - శివ చాపమునకు
సీత జనకునకు - వందనములిడి

పెట్టెలోన గల - శివ ధనస్సును
కడు మెలకువతో - బయటకు దీసి

శివ చాపమును - ఎక్కుబెట్టెను
ఆకర్ణాంతము - నారి సంధింప

ఘోర నినాదము - ఉద్భవించగ
ఫెళ్ళు ఫెళ్ళున - విరిగె చాపము

357. ఆ నిర్ఘోషకు - భూనభంబులు
దద్దరిల్లెను - పటుతరంబున

దిగ్గజంబులు - వణకసాగెను
నీరధులంత - ఘోషలాపెను

ఘనకార్ముక వి - చ్ఛేదనమునకు
రామలక్ష్మణు - గాధేయాదులు

జనక మహీపతి - తప్ప అందరును
మూర్ఛ నొందిరి - మహాధ్వనిని విని

358. జనక మహీపతి - అచ్చెరువొందెను
దశరథ రాముని - వీరత్వము గని

నా సంకల్పము - నెరవేరె నేటికని
సీతకు తగిన - వరుడు లభించెను

సీతారాముల - కళ్యాణమును
కనుల పండువుగ - నే గావించెద

అని జనకుడు - గాధేయుని జేరి
సమ్మతింపగా - ఆనతీయుమనె

(67 వ సర్గ సంపూర్ణం)

# 68 వ సర్గ

జనక మహారాజు దశరథుని కడకు వార్తాహరుల నంపుట

359. జనక మహీపతి - శుభవార్తను గొని
కడు వేగంబుగ - వార్తాహరులు
అయోధ్యపురిని - జేరుకొంటిరి
దశరథేశు గని - ముకుళితకరులై
మిథిలాధిపతి - వార్తాహరులము
శుభవార్తను గొని - వచ్చినారమని
ప్రీతిగ బల్కిరి - వీనుల విందుగ
దశరథరాజు - సంతసించగ

360. రామచంద్రుడు - శివచాపము గొని
సంధించగ అది - తునియలాయెనని
ధరణీజాత కు - మారి సీతకు
తగినవరుండు - రఘురాముడని
సీతారాముల - కళ్యాణమునకు
ఆశీస్సులిడి - తరలి రండని
జనక మహీపతి - ఆహ్వానమని
దూతలు బలికిరి - కడు ముదంబున

(68 వ సర్గ సంపూర్ణం)

# 69వ సర్గ

దశరథుడు బంధువర్గముతో మిథిలా నగరమునకు తరలి వెళ్ళుట

361. ముని వసిష్టుడు - వామదేవుడు
కశ్యప జాబాలి - కాత్యాయనలతో
సుమంత్రాదులగు - అష్టమంత్రులతో
రథగజ తురగ - పదాతి దళములతో
కడు శూరులగు - సేనాపతులతో
బంధుమిత్రుల - పరిజనములతో
దశరథేశుడు - సంతసమ్ముతో
తరలి వెళ్ళెను - మిథిలాపురికి

362. అయోధ్యాధిపతి - విదేహరాజ్యము
చేరిన సంగతి - వినిన జనకుడు
కడు ముదమ్మున - ఎదురుగ నేగి
ఉచిత రీతి - సన్మానము జేసి
వెంట నిడుకొని - విడిదికి జేర్చి
వసతులందరికి - స్వయముగ జూచి
మరునటి ఉదయము - కలసికొందమని
అనుమతి గైకొని - అరిగె గృహమునకు

363. సేవలందుకొని - మగపెండ్లివారు
వారి విడిదుల వి - శ్రాంతి చెందిరి

దశరథుడంతట - రామలక్ష్మణ
గాధేయులతో - ముచ్చటించెను

చేయుగవలసిన - పెండ్లి పనులతో
ఝామును క్షణముగా - రేయి గడచెను

తూర్పున భానుడు - ఉదయించగనే
పురము వెలుగొందె - అలకాపురి వలె

(69 వ సర్గ సంపూర్ణం)

## 70 వ సర్గ

వసిష్ఠ మహాముని రాముని వంశక్రమమును తెలుపుట

364. జనక మహీపతి - తన తమ్ముడగు
కుశధ్వజునితో - యాగము జరిపి
దశరథాదులను - రమ్మని పిలిచి
యథావిధిని స - త్కారము జేసి
మంత్రి పురోహిత - బంధుమిత్రులతో
సభ దీర్చినారు రాజన్యులతో
అంత వసిష్ఠుడు - సభలో నుడివెను
రామచంద్రుని - వంశక్రమమును

365. నలువకు కలిగె - మరీచి యనువాడు
మరీచి కుమారుడు - ముని కశ్యపుడు
కాశ్యపునకు జని - యించెను సూర్యుడు
రవికి కలిగెను - మనువనువాడు
మనువుకు కలిగె ఇ - క్ష్వాకు డనువాడు
మొదట అయోధ్యను - ఏలిన నరపతి
ఇక్ష్వాకుని సుతుడు - కుక్షి యనువాడు
వాని సుతుడు - వికుక్షి యనువాడు

366. వికుక్షుని సుతుడు - బాణుడనువాడు
వాని కుమారుడు - అనరణ్యుండు

అనరణ్య సుతుండు - పృధువనువాడు
వానికి కలిగె త్రి - శంకుడనువాడు

త్రిశంకుని సుతుడు - దుంధుమారుడు
వాని సుతుడు మాం - ధాత యనువాడు

మాంధాతకు సు - సంధి కుమారుడు
సుసంధి సుతుడు - ధృవసంధియనువాడు

367. ధృవసంధికి జని - యించెను భరతుడు
భరతు కుమారుడు - అసితు డనువాడు

అసితునకు జ - నించె సగరుడు
అతని కుమారుడు - అసమంజనుడు

అసమంజుని సుతుడు - అంశుమంతుడు
అంశుమంతు సుతుడు - ఆ దిలీపుడు

దిలీపునికి బుట్టె - భగీరథుడు
వానికి కలిగె క - కుత్స్థుడనువాడు

368. కకుత్స్థు సుతుడు - రఘువనువాడు
వాని తనయుడు ప్ర - వృద్ధుడనువాడు

ప్రవృద్ధుని సుతుడు - శంఖణుండు
వానికి కలిగె సు - దర్శనుడనువాడు

సుదర్శను సుతుడు - అగ్నివర్ణుడు
అగ్నివర్ణునికి - శీఘ్రగుడు బుట్టె

శీఘ్రగునకు - జనించెను మరువు
మరువు కుమారుడు - ప్రశుశ్రుకుడు

369. ప్రశుశ్రుకునికి - అంబరీషుడు
అంబరీషునకు - నహుషుడు సుతుడు

నహుషుని సుతుడు - యయాతి
యనువాడు
యయాతికి నా - భాగు డుదయించె

నాభాగుని సుతుడు - అజుడనువాడు
అతని సుపుత్రుడు - దశరథరాజు

దశరథునకు - కుమారులు నల్వురు
రామలక్ష్మణు - భరత శత్రుఘ్నులు

370. రఘురాముడు ప - రాక్రి విక్రముడు
అంత యశము గల - వారి వంశముతో

వియ్యమొందుట - కడు శుభకరమని
నీ ద్వితీయసుత - ఆ ఊర్మిళను

లక్ష్మణుకొసగి, నా - మాట తీర్చుమని
ముని వసిష్టుడు - సభలో తెలిపెను

రామచంద్రుని - వంశక్రమమును
జనక మహీపతి - సంతసించెను

(70 వ సర్గ సంపూర్ణం)

# 71, 72 వ సర్గలు

జనక మహారాజు తన వంశ క్రమమును వివరించుట

371\. ఆ ఇక్ష్వాకుల - వంశక్రమమును
జనక మహీపతి - ఆలకించెను
వసిష్టాది ముని - ముఖ్యులందరికి
బద్ధాంజలియై - ఇటుల పలికెను
కన్యాప్రధాన - సమయమందున
తన వంశమును - వివరింతునని
కన్యాదాతగ - తన ధర్మమని
సభలో దెలిపెను - మిథిలాధిపతి

372\. ముజ్జగములలో - పేరు కలవాడు
నిమి యనువాడు - మూల పురుషుడు
నిమి తనయుండు - మిథి యనువాడు
మిథిలాపురి ని - ర్మించినవాడు
మిథి కుమారుడు - ఉదావసుండు
అతని తనయుడు - నందివర్ధనుడు
నందివర్ధనుని సు - తుడు సుకేతుడు
సుకేతుని సుతుడు - దేవరాతుడు

373. దేవరాతు సుతుడు - బృహద్రథుండు
అతని సుపుత్రుడు - మహావీరుడు

మహావీరుని - సుతుడు సుధృతి
సుధృతికి బుట్టె - దృష్టకేతుడు

దృష్టకేతునకు - హరియశ్వుండు
అతని కుమారుడు - మనువనువాడు

మనువ కుమారుడు - ప్రతింధకుండు
ప్రతింధకు సుతుడు - కీర్తిరథుండు

74. కీర్తిరథుని సుతుడు - దేవమీఢుడు
అతని కుమారుడు - విభుడనువాడు

విభుని కుమారుడు - మహేంద్రకుడు
అతని తనయుడు - కీర్తిరాతుడు

కీర్తిరాతునికి - మహారోముడు
అతని కొమరుడు - స్వర్ణరోముడు

స్వర్ణరోమునికి - హ్రస్వరోముడు
అతని సుతులము - మే మిరువురము

375. అని జనకుడు తన - వంశక్రమమును
కడు ముదమ్మున - సభకెరిగించెను
నా కుమార్తెలగు - సీత ఊర్మిళల
రామ లక్ష్మణులకు - నే ఒసగెదనని
రాబోవు మంచి - శుభ లగ్నమున
ఉత్తర ఫల్గుణి - తారయందున
కళ్యాణములు - జరిపించుదమని
మిథిలానాథుడు - ప్రీతిగ పలికెను

376. ఆ సమయమున - వసిష్ట కౌశికులు
ఒకరికొకరిగా - సంప్రదించుకొని
జనకుని తమ్ముడు - ఆ కుశధ్వజుని
ఇరువురు సుతలు - తమకు నచ్చిరని
ఆ కన్యలను భర - త శత్రుఘ్నులకు
ఆ లగ్నమునకే - పెండ్లి సేయుదని
సభలో పలుకగ - సమ్మతించిరి
దశరథ జనక - మహీపతులిర్వురు

(71 72వ సర్గలు సంపూర్ణం)

## 73 వ సర్గ

377. అటు పిమ్మట ఆ - దశరథాదులు
విడిదికేగి సుఖ - నిదుర జెందిరి

మరుసటి దినమున - వేకువజామున
గోదానములు సు - వర్ణ దానములు

రాజసుతులచే - చేయించితిరి
కేకయురాజ సు - తుడు యుధాజిత్

అట కేతెంచెగ - బావమరిది గని
దశరథుడంతట - సన్మానించెను

78. మా జనకుడు మీ - కుశలము లడిగెను
మా క్షేమములు - మీకు తెలుపమనె

భరతుని గాంచగ - కోరిక కలిగి
తోడ్కొని రమ్మని - నన్ను బంపెను

నే అయోధ్యకు - జేరుకొంటిని
పెండ్లివార్త విని - మురిసిపోతిని

సంతసించి నే - నిటుకు వచ్చితన
దశరథుడెంతో - మోదము చెందెను

379. వేకువజామున - లేచి దశరథుడు
సకలాభరణ - భూషితులయిన

తోరణంబులను - కరముల దాల్చిన
పలు శోభలతో - వెలుగులు జిందెడి

రామలక్ష్మణ - భరత శత్రుఘ్నుల
విశ్వామిత్ర వ - సిష్టాదులతో

కడు విజయంబగు - సుముహూర్తమున
తోడ్కొని ఏగెను - యాగశాలకు

380. అటులేతెంచెడి - వారిని గాంచి
ఎదురుగ నేగి - జనక మహీపతి

సర్వభూషణా - భూషితులయిన
సర్వమంగళా - కారులైనట్టి

కడుశోభల - అలరారుచుండెడి
నలువురు పెండ్లి - కుమారైలుముదమున

వేచియున్నారు - పెండ్లి వేదికను
అనుచు జనకుడు - ఆహ్వానించెను

381. జనక మహీపతి - మునివసిష్ఠు గని
మునినాయక ఇక - వివాహమునకు

వలయు క్రియలను - సలుపవలెనన
శాస్త్రోక్తముగా - కడు అందముగా

పెండ్లి వేదికను - అలంకరించి
సప్తజిహ్వాని - వెలయుగ జేసి

పుష్పగంధములు - హేమ పాత్రలు
అక్షతలున్న - స్వర్ణపాత్రిలు

382. జాజాల పాలికలు - ప్రసూనంబులు
అర్ఘ్యపాత్రలు - శంఖపాత్రిలు

సాంకురంబగు - కుంభ సంతతులు
ధూపదీపములు - వజ్రపాత్రిలు

మంత్రయుక్తమగు - దర్భలు పరచి
ముని వశిష్ఠుడు - కడు సంప్రీతిని

వధూవరుల అ - భ్యుదయముకొరకు
మంగళకరమగు - హోమము జేసెను

383. జనక మహీపతి - కడు హర్షముతో
జలజ పత్రాయత - లోచనుని గని

విసుత సుశీల - నా సుత సీత
నేడు మొదలు ఇక - నీ సతి సీత

నీ జతగూడిన - పూత చరిత్రి
నిన్నెడబాయని - మహా పతివ్రత

పాణిగ్రహణము - ఇక గావింపుము
నీ అర్ధాంగిగ - స్వీకరింపుమని

384. శుభమంత్రంబుల - పూతజలముల
రఘురాముని ఇరు - కరములందున

ధారబోసెను - జనక మహీపతి
సురవాద్యంబులు - మిన్నుముట్టగా

అప్సరాంగనలు - నాట్యము జేసిరి
దేవఋషులు కడు - సంతసించిరి

సురలందరును - కుసుమవర్షమును
సీతారాములపై - కురిపించిరి

385. అటుపిమ్మట ఆ - మిథిలాధిపతి
ఓ లక్ష్మణా ఈ - ఊర్మిళను గొనుము
ఓ భరతా మాం - డవిని గొనుము
శత్రుఘ్నా శృత - కీర్తిని గొనుము
అనుచు జనకుడు - ముగ్గురు వరులను
పాణి గ్రహణము - జేయగోరుచు
శుభమంత్రంబుల - పూతజలములు
ధారబోసెను - వారి కరముల

386. ఆ విధి దశరథ - రాకుమారులు
జనక కుశధ్వజు - రాజతనయుల
పాణిగ్రహణము - గావించినారు
వేదయుక్తముగ - అగ్నివేదికకు
ప్రదక్షిణలు జేసి - ప్రణమిల్లినారు
తల్లిదండ్రులకు - అత్తమామలకు
పెద్దలందరికి - వందనములిడి
శుభాశీస్సులు - అందుకొనినారు

(73 వ సర్గ సంపూర్ణం)

# 74వ సర్గ

387. మరుసటి దినమున - విశ్వామిత్రుడు
వధూవరులను - జేరగ బిలచి
ప్రీతి మీరగా - దీవెనలొసగి
దశరథ జనక - మహీపతుల దరి
శలవు గైకొని హి - మాలయములకు
వెడలెనాతడు - తపము జేయగ
దశరథాదులు - జనకునికపుడు
వీడ్కోలు పలికి - మరలె అయోధ్యకు

388. శత సహస్రముగ - గోగణంబులు
నవరత్నయుత - భూషణంబులు
రత్నరజిత సు - వర్ణరాసులు
రత్న విలసిత - కంబళములు
శత సహస్రముగ - దాస జనములు
రథ గజ తురగ - పదాతి దళములు
జనకుడంత తన - తనయుల కొసగి
ప్రీతిగ బంపెను - మెట్టినింటికి

## దశరథుడు దుశ్శకునములఁ గాంచుట

389\. దశరథాదులు - సంతసమ్మున
అయోధ్య నగరికి - ఏగుచుండగా
మార్గ మధ్యమున - అతి ఘోరముగా
చెడు శకునములు - గోచరించెను
పక్షులు కూసెను - భయంకరముగా
మృగావళులు ప్ర - దక్షిణలు జేసె
దశరథరాజు - మునివసిష్ఠు గని
భీతిగ పలికె - ఇదేమి వింతయని

390\. పక్షుల కూతలు - తెలుపుచున్నవి
అతి ఘోరమగు - భీతి కలుగునని
ప్రదక్షిణలు జేయు - మృగముల పోకడ
తెలుపుచున్న దుప - శాంతి కలుగునని
కావున భయమును - విడనాడుమని
దశరథుని గని - వసిష్ఠుడు పలికెను
ఆ సమయంబున - పెను సుడుగాలులు
అతి భీకరముగ - సాగెనచ్చట

## పరశురాముడు ప్రత్యక్షమగుట

391. నలుదిశలందు - దుమారమెగసెను
తరు సంతతులు - పుడమిని గూలెను
పెను చీకటులు - భానుని గ్రమ్మెను
ప్రళయ ఘోషతో - ధరణి వణకెను
రథ గజ తురగ - పదాతి దళములు
పటాపంచలై - మూర్ఛనొందెను
దశరథాదులు - కడు అచ్చెరమున
జూడసాగిరి - ఏమగునో యని

392. గాంచిరి వారు - క్రోధలోచనుని
హిమగిరి బోలు - మహోన్నతుని
ధనుర్ధారిని - భీమరూపుని
ఘనచాపము - ధరించినవానిని
మూపున పరశువు - దాల్చినవానిని
క్షత్రియులను - కడతేర్చినవానిని
తేజోమయుని - పరశురాముని
దశరథాదులు - గాంచిరంతట

( 74 వ సర్గ సంపూర్ణం)

# 75 వ సర్గ

## పరశరాముని గర్వభంగము

393. పరశురాముని - గాంచినంతనే
మునివసిష్టు డిటు - యోచన జేసెను
తండ్రి మనసునకు - దృప్తిని గూర్చగ
పరశువును గొని - కక్షను బూని
ఇరువది యొక్క - పర్యాయములు
ధరణీపతులను - దునిమె నీతడు
మరల రాజులకు - కీడొనరించగ
ఇటులరుదెంచెనా - అని యోచించెను

394. వసిష్టాది ముని - వర్యులంతట
భార్గవరాముని - కర్ఘ్యములిచ్చి
పూజింపగ సం - ప్రీతిని బొంది
భృగురాముడు - శ్రీరాముని గని
కౌశికు యాగము - గాచినావట
శివచాపమును - ద్రుంచినావట
కడు అద్భుతమగు - నీ వీరత్వము
పరికింపగ నే - నిటకు వచ్చితనె

( 75 వ సర్గ సంపూర్ణం)

# 76వ సర్గ

395. ప్రళయకాలపు - రుద్రునివోలె
పటు కోపమున - హుంకరించెడి
పరశు రాముని - గాంచినంతనే
పాదములంతట - పట్టుదప్పగా
కనులనుండి బా - ష్పములు రాలగ
బంధుజనము పరి - వారము జూడగ
దీనత దోపగ - ముకుళితకరుడై
దశరథేశుడు - ఈ విధి పలికెను

396. ధరణియందు గల - ధరణీపతులను
తప్పక నిరువది - యొక్కమారులు
నీ జనకుని సం - తుష్టుని జేయగ
నీ పరశువుతో - ద్రుంచినావు గద
పిమ్మట నీవు - కినుకను విడచి
రాజవరులకు - మేలు జేసితివి
మరల నేడు కో - పాగ్ని రగులుటకు
కారణమేమో - తెలియకున్నదనె

397. సంతతి లేమిచే - నను విడచితివి
యజ్ఞఫలముగా - నాకు కలిగిన
రఘురాముడు నా - అరవప్రాణము
పదహారేండ్ల - నవయౌవ్వనుడు
పరిణయమిపుడే - గావించితిని
రాము తప్పిదము - ఒప్పుగ గైకొని
నీ ఔదార్యము - జూపించుమయా
శాంతింపుమయా - రేణుక తనయ

398. పరశురాముని - మొండిపట్టు గని
తన జనకుని కడు - దీనతను గని
శ్రీ రఘురాముడు - ఆగ్రహమును గొని
విష్ణుచాపమును - వానినుండి గొని
శరసంధానము - జేసినంతనే
వానియందు గల - విష్ణుతేజమును
హరియించెను ఒక - క్షణమాత్రమ్మున
పరశురాము గని - రాముడిటులనె

399. ముని కౌశికుని - బంధువగుటచే
బ్రాహ్మణుండవై - బుట్టుటచేత

చంపజాల నీ - శరమును వదలి
ఒకపరి నే సం - ధించిన శరము

వ్యర్థము జేయుట - సాధ్యము గాదు
నీవార్జించిన - పదగతిగాని

సంపాదించిన - తపమునుగాని
శరమునకాహుతి - జేయుగ పలికెను

400. అటుల పలికెడి - శ్రీ రాముని గని
తన తపమునె - ఖండింపగ వేడెను

రాముని శరము - భార్గవరాముని
తపః ఫలమును - తృటిలో తృంచెను

భార్గవ రాముడు - తెలివిని బొంది
నీ మాయను పరి - కింపగ లేక

నా హృదిలో నిను - తప్పుగ దలచితి
ఎరిగితి నేను - జగతీపతివని .

401. నీరధి సుతశ్రీ - లక్ష్మిపతివని
నీదరి నేను - ఓడిపోతినని

గర్వభంగము - నేనొందితినని
లజ్జ యొకింతయు - లేదు మనమున

నీ మహాత్మ్యము - నాకెరిగించగ
వచ్చితివా ఓ - నీరజలోచన

అని శ్రీరాముని - పరిపరి పొగడి
మహేంద్ర గిరికి - మరలిపోయెను

( 76 వ సర్గ సంపూర్ణం )

# 77వ సర్గ

## దశరథరాజు బంధుమిత్ర పరివారముతో అయోధ్యను జేరుకొనుట

402. అంత రాముడు - తన చెంతను గల
విష్ణు చాపమును - వరుణునకొసగి
వసిష్ఠాదులకు - అంజలి ఘటించి
జనకుని జేరి - ఆనందించెను
తన తనయుడు - అతిలోక వీరుడని
కౌగిట జేర్చి - శిరమును మూర్కొనె
అందరు వెడలిరి - ఆనందముగా
అయోధ్యపురిని - జేరుటకొరకు

403. కడు విశాలమగు - రాజవీధుల
పన్నీరు చిలికి - పూలు పరచిరి
మంగళ ధ్వనులు - మిన్నుముట్టెను
పలుపలు రంగుల - ధ్వజములెగసెను
స్వస్తి పలికిరి - రాపురోహితులు
జయనాదముల - దిక్కులు నిండెను
దశరథాదులు - ప్రవేశించిరి
ఆనందముతో - అంతఃపురమున

404. కౌసల్య సుమిత్రి - కైకేయాదులు
కొడుకులను కో - డళ్ళను దోడ్కొని
స్నానాదులు ప - న్నిట జేయించి
మణిభూషణ పీ - తాంబరములొసగి
దేవతలందరి - ఆశీస్సులకై
రామలక్ష్మణ - భరత శత్రుఘ్నులచే
దేవగణముల పూ - జింప జేసిరి
హారతులిచ్చి - ఆనందించిరి

405 సీతను గూడి - రామచంద్రుడు
ఊర్మిళను గూడి - లక్ష్మణుండును
మాండవిని గూడి - భరత కుమారుడు
శృతకీర్తి గూ - డి శత్రుఘ్నుడును
దివ్య దేదీప్య మం - దిరములు జేరి
సుఖముల దేలుచు - హాయిగ నుండిరి
దశరథ నరపతి - అమరేంద్రుని వలె
హాయిగ నుండెను - రాజ్యమేలుచు

406. కొంతకాలమటు - గడచిన పిమ్మట
మేనమామ యగు - యుధాజిత్తుడు

దశరథు జేరి - ఇటుల పలికెను
తాతగారగు - కేకయరాజు

తన మనుమలను - జూడగోరిరి
అని పలుకగ ఆ - దశరథేశుడు

మిము గొనిపోవగ - మాతులుడొచ్చెను
జాలము చేయక - వేగ చనుడనె

407. జనకుని అనతి - శిరమున దాల్చి
గురుదేవులకు - ప్రణతులర్పించి

తాతను గాంచగ - గిరివ్రజపురికి
భరత శత్రుఘ్నులు - ఆనందముగా

మేనమామను - అనుసరించి జనె
తల్లిదండ్రులకు - సేవలు జేసెడి

సద్గుణవంతులు - రామలక్ష్మణులని
ఖ్యాతిగని మ - న్ననలు పొందిరి

408. దశరథ తనయుడు - రామచంద్రుడు
పితృవాక్య పరి - పాలన శీలుడు
రాచకార్యముల - ఎల్లవేళలా
తండ్రికి తోడుగ - సంచరించెను
మంత్రి పురోహిత - పురజనులందరు
శ్రీరాముని వే - నోళ్ళ బొగడగ
సీతతోడ శ్రీ - రాముడు శోభిల్లె
లక్ష్మితోడ శ్రీ - విష్ణువు వోలె

409. అనవరతము - శ్రీరాముని దలచు
సీత మనసు - రామునికే తెలుసు
సర్వ సులక్షణ - లక్షితగాత్రులు
సర్వలోకముల - పూజనీయులు
సీతపైన రా - ముని ప్రేమకన్న
రామునిపై - సీతప్రేమ మిన్న
సీతగూడి రఘు - రాముడు శోభిల్లె
లక్ష్మిని గూడిన శ్రీ - విష్ణువు వోలె

(77 వ సర్గ సంపూర్ణం)

బా ల కాం డ స మా ప్తం



# ఫలశ్రుతి

శ్రీ రామాయణ - కల్పతరువుపై
కవికోకిల వా - ల్మీకి రచించిన
శ్రీ రామాయణ - మధుర గానమును
అంజని సుతుని - ఆనతి మేరకు

రచన జేసితిని - రామదాసులకు
భక్తితో చదివిన - వినిన వారలకు
సీతారాములు - వాయుకుమారుడు
ఇత్తురు శుభములు - ఎల్లవేళలా

ఓం శాంతి శాంతి శాంతిః